
100
GLASS
PACK
NEW REFRESHING
Rasna








Learn
to Add
and Subtract









# చందమామ

ఏప్రిల్ 1991



ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు






విడి ప్రతి: 3-00

సంవత్సర చందా: 36-00






# మేగీ క్లబ్-అడవులలో సరదా వినోదం ఉచిత బహుమతుల ఆనందం



మేగీ 'అవరేనెస్ వైల్డ్ లైఫ్' ఆటలో వన్యమృగాలను రక్షించండి.



మేగీ 'కింగ్ ఆఫ్ ద జంగిల్': ఆటలో అడవులు జయించండి.

బాలలూ రండి ! మేగీ క్లబ్‌లో చేరి. సంవత్సరమంతా సరదా వినోదాలలో పాల్గొనండి. మిమ్మల్ని ఉర్రూతలూగించే న్యూస్ లెటర్స్ బహుమతులు, ఆటలూ ఇంకా ఎన్నెన్నో !

మీరు చేయాల్సినది ఈ [MAGGI] ను 5 ఖాళీ మేగీ నూడుల్స్ పేకల నుండి కత్తిరించి. మీ పేరు. చిరునామా. మీకు నచ్చిన బహుమతిని పేర్కొని మాకు పంపండి. మీరు గనుక మెంబరయితే మీ నంబరును వ్రాయటం మరువకండి. మీరింకా మేగీ క్లబ్ మెంబరుకాని పక్షంలో, మెంబరుకావటానికిదే మంచి అవకాశం. మీ వివరాలతో బాటు మెంబర్‌షిప్ కావాలని వ్రాయండి. మీ బహుమతితో బాటు. మేగీ క్లబ్ మెంబర్‌షిప్ కార్డు ఉచితంగా పంపబడుతుంది.



మేగీ 'జాదూ జంగిల్' మీరు స్వంతంగా నిర్మించండి.



ఆర్చీ కామిక్స్

మా అడ్రసు:

**మేగీ క్లబ్**

పి.ఒ. బాక్స్. 5788,
న్యూ ఢిల్లీ-110 055

మేగీ 'బర్డ్ హౌస్' ను నిర్మించండి.

ఉచిత మేగీ 'వరల్డ్ ఆఫ్ యానిమల్స్' ప్రశ్నోత్తరావళి
మీరు 3 బహుమతులు సేకరించగానే. ఆసక్తికరమైన, ఉత్కంఠత కలిగించే అద్భుత యదార్థ విషయాలెన్నో తెలియజేసే ఉచిత మేగీ 'వరల్డ్ ఆఫ్ యానిమల్స్' ప్రశ్నోత్తరావళిని పంపుతాము. గేమ్‌లోనున్న వివరాలను శ్రద్ధగా చూడండి.









మరొక ఉపహారం: ఈ సరికి మీరు 'లాస్ట్ ఆఫ్ ద జంగిల్ గేమ్'ను సేకరించి ఉండక పోతే, వెంటనే దానిని పొందండి.

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

## మండుతూన్న బావులు!

ఇరాక్ సేనలు కువైట్ నుంచి తిరిగి వెళ్ళడంతో సింధుశాఖలో యుద్ధం ముగిసింది. అయితే, వెళుతూ వెళుతూ, ఇరాక్ సేనలు కువైట్‌లోని వందలాది చమురు బావులకు నిప్పంటించాయి. ఆ బావులు ఇంకా మండుతూ వుండడంవల్ల, రోజూ కోట్లాది రూపాయల విలువచేసే చమురు మంటలపాలవుతున్నది. ఈ మంటలు పొంతం చల్లారడానికి మరికొన్ని సంవత్సరాలు పట్టవచ్చని నిపుణులు అభిప్రాయపడుతున్నారు!

కువైట్‌లోని చమురు బావులను తగలబెట్టడం ద్వారా ఆ దేశాన్ని నాశపరచవచ్చని ఇరాక్ భావించింది. ఆ బావులు కువైట్‌కు సొంతమైనప్పటికీ, అవి ప్రపంచమంతటికీ ఉపయోగపడుతున్న ప్రకృతి వనరులు. వాటి నష్టం ప్రపంచాన్నంతటినీ బాధిస్తుంది. అందువల్ల మానవజాతికంతటికీ ఉపయోగపడే ఇటువంటి ప్రకృతి సంపదల పరిరక్షణ గురించి ప్రపంచదేశాలన్నీ తీవ్రంగా ఆలోచించాలి. విడివిడి దేశాలకు మాత్రం చెందిన సంపదలు ఏవి? ప్రపంచదేశాలన్నిటికీ అంటే—మానవజాతికంతటికీ సంబంధించిన సంపదలు ఏవి? అన్న విషయాన్ని నిర్ణయించి, వాటి రక్షణకు సరైన పథకం రూపొందించాలి.

సంపుటి 88 ఏప్రిల్ '91 సంచిక 4

విడి ప్రతి : 3-00 : : సంవత్సర చందా : 36-00






# పెద్దయితే పెద్ద మజా
# సుధలో ఉంది భలే మజా!



సుధ సాఫ్ట్ డ్రింక్ కాన్సెంట్రేటులో
మజా అంటే మజా. పెద్ద మజా.
పెద్ద సంఖ్యలో ఫ్లేవర్స్ — మొత్తం 13 !
ఒక్క ప్యాకులో పెద్ద సంఖ్యలో గ్లాసులు —
మొత్తం 32 గ్లాసులు !
సుధ అంటే నిజంగా పెద్ద మజా. కదూ !




'పెద్ద' పిన్నలకు పెద్దగా నచ్చేది.

**సుధ**

సాఫ్ట్ డ్రింక్ కాంన్సెంట్రేట్


అమ్మకం చేయువారు: సార్థా ఫుడ్స్ అండ్ ఫ్లేవర్స్, నాశిక్.

everest/90/SFF/63 tl




పర్షియన్ సింధుశాఖలో యుద్ధం ముగిసింది. ఇది గొప్ప ఉపశమనం కలిగించే విషయమేగాని, ఆనందించడానికి మాత్రం ఏమీలేదు. ఎందుకంటే రెండు దేశాల మధ్య అభిప్రాయభేదాలు ఏర్పడినప్పుడు, వాటిమధ్య మంతనాలు జరిపి, సయోధ్య కుదర్చడానికి ఎన్నో అంతర్జాతీయ సంస్థలు కృషిచేస్తున్న ఈ కాలఘట్టంలో యుద్ధం ప్రారంభంకావడమే విచారకరమైన విషయం!

ప్రపంచశాంతి పరిరక్షణకు పాటుపడే సంస్థలలో ఐక్యరాజ్యసమితి ప్రధానమైనది. సింధుశాఖ ఘర్షణలో, శాంతి పరిరక్షణకు ఐక్యరాజ్యసమితి చేసిన కృషి ఎలాంటిదో క్లుప్తంగా చూద్దాం.

అంతర్జాతీయశాంతి భద్రతలు ప్రధాన ఆశయంగా 1945 వ సం॥ అక్టోబర్ 24 వ తేదీన ఐక్యరాజ్యసమితి ఆవిర్భవించింది. ప్రపంచదేశాలన్నీ చిన్నా, పెద్దా భేదం లేకుండా ఈ సమితిలో సభ్యత్వం పొందవచ్చు. భావితరాలను యుద్ధ బాధనుంచి రక్షించడానికి పాటుపడగలదని ఐక్యరాజ్యసమితి తన చార్టర్‌లో స్పష్టంగా చెబుతున్నది.

ఇరాక్ తన పొరుగున వున్న చిన్న స్వతంత్రదేశమైన కువైట్ మీద దురాక్రమణ జరిపి వశపరచుకున్నది. ఇరాక్‌ను వైదొలగమని, ఐక్యరాజ్యసమితి అనేకసార్లు కోరింది. అయినా ఇరాక్ ఏమాత్రం వినిపించుకోలేదు. అందువల్ల అఖరికి ఐక్యరాజ్యసమితి—కువైట్ విముక్తికి బలప్రయోగానికి పూనుకోవాలన్న సభ్య దేశాల అభిప్రాయాన్ని అంగీకరించి తీర్మానం నెరవేర్చింది. మిత్రపక్షాల సేనలకు అమెరికా నాయకత్వం వహించింది. దానికి 37 దేశాలు సహాయపడ్డాయి. ఈజిప్టు, ఫ్రాన్స్, సౌదీఅరేబియా, ఇంగ్లాండు తమ సైన్యాలను పంపాయి. కెనడా, జర్మనీ దేశాలు కూడా సహకరించాయి.

కువైట్‌కు విముక్తి కలిగించడమే యుద్ధం ప్రధాన లక్ష్యం; ఇరాక్‌ను ఓడించడంకాదు. కువైట్‌కు స్వతంత్ర దేశంగా వుండే హక్కును మళ్ళీ సాధించిపెట్టడానికి మిత్రపక్ష సేనలు పోరాడాయి. అఖరికి తమ లక్ష్యాన్ని సాధించాయి. కువైట్ స్వతంత్ర దేశమయింది. అయినా, ఈ ఆశయసిద్ధికి ఎంతో రక్తపాతం జరిగింది. వాతావరణం కలుషితమైపోయింది. తీవ్రమైన ధననష్టం, జననష్టం వాటిల్లాయి. ఇరాక్, ఐక్యరాజ్యసమితి తీర్మానాన్ని గౌరవించి అంగీకరించి వున్నట్టయితే ఇన్ని నష్టాలు కలిగి వుండేవి కావు. ఇంతకూ ఇరాక్‌కూ

ఐక్యరాజ్యసమితిలో సభ్యత్వం వుంది! శాంతియుత మార్గాలగుండా తనలక్ష్యాన్ని సాధించేస్థాయికి ఐక్యరాజ్యసమితి ఇంకా ఎదగలేదన్న వాస్తవం ఈ యుద్ధం ద్వారా బయటపడింది. దీనినొక గుణపాఠంగా భావించి, ఐక్యరాజ్యసమితి సభ్యదేశాలన్నీ ఈ బలహీనతను తొలగించుకోవడానికి తీవ్రంగా ఆలోచించాలి. ఇక ముందయినా ఇటువంటి ఘర్షణలు రాకుండా అరికట్టడానికి కృషి చేయాలి.











# పరోపకారి

హరితపురంఅనే గ్రామంలో సుందరయ్య, లక్ష్మి అనే పేదదంపతులుండేవారు. వాళ్ళకు శివుడనే కొడుకూ, ఒక చిన్న పూలతోటా వుండేవి. శివుడి తల్లిదండ్రులు ఆ పూలతోటనెంతో అపురూపంగా, ప్రాణప్రదంగా చూసుకునేవారు. వాళ్ళ చేయి తాకితే ఆ తోటలోని ఎండిన మొక్కయినా పచ్చగా మారేది. శివుడి తల్లి అదంతా వనదేవత, తమ మీద చూపే దయ అని కొడుకుకు తరచూ చెబుతూండేది.

ఒకసారి శివుడి తల్లికి జబ్బు చేసింది. వైద్యం చేయించడానికి డబ్బు లేక, శివుడి తండ్రి సుందరయ్య, వడ్డీ వ్యాపారి వైకుంఠం దగ్గరకు అప్పుకోసం వెళ్ళాడు. వైకుంఠం అప్పుకు చక్రవడ్డీలు కట్టి, గ్రామంలో ఎందరి ఆస్తులో, తన సొంతం చేసుకున్నాడు.

వైకుంఠం, సుందరయ్య పూలతోటను హామీగా పెట్టుకుని, వందవరహాలు అప్పుగా ఇచ్చాడు. ఆ డబ్బుతో సుందరయ్య, భార్యకు వైద్యంచేయించినా ప్రయోజనం లేకుండా పోయింది. శివుడి తల్లి జబ్బుతో కన్ను మూసింది,

ఆమె చనిపోయేముందు కొడుకును దగ్గిరకు పిలిచి, ''శివుడూ! వనదేవత దయగలతల్లి. ఆ తల్లిని ఏనాడూ మరవకు!'' అని చెప్పింది.

సంవత్సరం గడిచాక వైకుంఠం, సుందరయ్యతో, ''నువ్వు తీసుకున్న అప్పు, వడ్డీతో కలిసి ఐదువందల వరహాలయింది. అది తీర్చేవరకూ నీ పూలతోట, నా స్వాధీనంలో వుంటుంది,'' అని చెప్పి తోటను స్వాధీనం చేసుకున్నాడు.

అనాటి నుంచీ శివుడు, తండ్రితోపాటు పూలతోటలో తోటమాలిగా పని చెయ్య

ఎస్. శివనాగేశ్వరరావు



సాగాడు. మరొక సంవత్సరం గడిచి పోయాక వైకుంఠం, సుందరయ్యతో, "వడ్డీ అసలుకు నాలుగింతలయింది. ఈ బాకీ నీ జీవితంలో తీర్చలేవు. ఈ రోజు నుంచి నీ కొడుకును నా ఇంటి దగ్గిర పని చేయనీ; అలాగయినా కొంత బాకీ తీరుతుంది!" అని చెప్పి శివుణ్ణి తన ఇంటి నౌకరుగా చేసుకున్నాడు.

ఆ విధంగా ఇంకొక సంవత్సరం గడిచి పోయింది. వాడికి తనూ, తండ్రీ వైకుంఠానికి ఎన్నేళ్ళపాటు వెట్టిచాకిరీ చేసినా, తమ బాకీ తీరదని అర్థమై పోయింది. ఒకవేళ వనదేవత కరుణిస్తే, తమ కష్టాలు తీరవచ్చునేమో అని ఆలోచించి, వాడొక రాత్రివేళ సమీపంలో వున్న అడవికి పారిపోయాడు.

అది మండు వేసవికాలం. శివుడు అడవిలో తనకు కనిపించిన కొలను నీళ్ళతో, ఆ చుట్టుపక్కల ఎండిపోతున్న మొక్కలను తడపసాగాడు. వాడా విధంగా నెల రోజులపాటు శ్రమించాక, వనదేవతకు వాడి మీద దయ కలిగింది.

ఆమె ఒకనాడు శివుడికి ప్రత్యక్షమై, "శివుడూ! నీ సేవలు నాకు ఎంతో తృప్తి కలిగించాయి. ఏం కావాలో కోరుకో!" అన్నది.

శివుడు, వైకుంఠం చక్రవడ్డీ పేరుతో తననూ, తన తండ్రినీ ఎలా బానిసలుగా చేశాడో చెప్పుకున్నాడు.

అప్పుడు వనదేవత దయగా నవ్వి, వాడికొక చెట్టుకొమ్మ నుంచి బంగారంలా మిలమిలా మెరుస్తూ వేలాడుతున్న కాయ నొకదాన్ని చూపించి, "ఆ కాయ నా మహిమవల్ల, నీకు కనిపిస్తున్నది. దాన్ని తిన్నావంటే, నువ్వెవరికంటికీ కనిపించవు. నీ సమస్యను తెలివిగా పరిష్కరించుకో. అయితే, ఒక్క షరతు! నీ సమస్య పరిష్కారం కాగానే, నా దగ్గిరకు రా. అప్పుడు నీ రూపం నీకు ప్రసాదిస్తాను. ఏమాత్రం ఆలస్యం చేసినా, నేను నీకు కనబడను. అప్పుడు శాశ్వతంగా నువ్వు

అదృశ్యరూపంలోనే వుండిపోతావు.'' అని హెచ్చరించింది.

శివుడు, వనదేవతకు నమస్కరించి, కాయ కోసితిని, తన గ్రామం చేరాడు. ఈ లోపల శివుడు పారిపోయాడన్న కోపంలో వున్న వైకుంఠం, వాడి తండ్రి ఘుందరయ్యను చెట్టుకుకట్టి చింతబరికెతో బాదుతున్నాడు.

ఇది చూస్తూనే అదృశ్యంగా వున్న శివుడు ఒక్క పరుగునపోయి, వైకుంఠం నడుంమీద బలంగా తన్నాడు. ఆ దెబ్బకు వైకుంఠం ఎగిరి దూరంగా పడ్డాడు. చుట్టూ చేరిన జనం అలా ఎందుకు జరిగిందో తెలియక ఆశ్చర్యపడుతున్నంతలో, శివుడు చింతబరికెను తీసుకుని, వైకుంఠాన్ని ఎడాపెడాబాది, అతడి నడుం నుంచి వేలాడుతున్న తాళంచెవులను లాక్కుని, అక్కడి నుంచి బయలుదేరాడు.



చింతబరికె గాలిలో రివ్వురివ్వుమంటూ కదలడం, తాళంచెవులు అలా శూన్యంలో కదిలిపోతూండడం చూసి, జనం ఇదేదో భూతం చేస్తున్న పని అనుకుని, అక్కడి నుంచి పారిపోయారు.

శివుడు సరాసరి వైకుంఠం ఇంటికి పోయి, గదిలో వున్న ఇనప్పెట్టె తెరిచి, అందులో వున్న వడ్డీ పత్రాలన్నీ బయటికి లాగి, వాటికి నిప్పుపెట్టాడు. ఇది చూసి వైకుంఠం పిచ్చిపట్టినవాడిలా కేకలు పెడుతూంటే, గ్రామస్థులు చక్రవడ్డీల అప్పుల పీడ విరగడ అయిందని సంతోషంగా చప్పట్లు చరిచారు.

శివుడు తన సమస్య పరిష్కారం కావడంతో, ఆనందంగా వనదేవతను కలుసుకునేందుకు బయలుదేరాడు. మార్గమధ్యంలో చీకటిపడింది. వాడొక ఇంటి వసారాలో, ఆ రాత్రి గడపాలనుకున్నాడు. అయితే, ఆ ఇంట్లో వున్న వృద్ధదంపతులిద్దరు—తాము కుమార్తె పెళ్ళి కట్నానికి గాను కూడబెట్టిన వెయ్యివరహాలను, గజదొంగ జగ్గడనేవాడు దొంగిలించుకు




పోయాడని విలపించడం వాడి కంట బడింది.

అది చూసి శివుడు ఆలోచనలో పడ్డాడు. తన సమస్య పరిష్కారం కాగానే రమ్మని, వనదేవత హెచ్చరించింది! కాని వాడికి ఆ వృద్ధులకు సాయపడడం ధర్మం అనిపించింది. ఇందువల్ల తను శాశ్వతంగా అదృశ్యరూపంలోనే వుండి పోవడం జరగవచ్చు. కానీ ఏమైతే అదవుతుంది, అన్న మొండి తెగింపుతో శివుడు వసారాలో నుంచి బయటికి వచ్చి, వీధిలో నడవసాగాడు. ఒకచోట ఇద్దరు ఒక ఇంటికి కన్నం వేస్తూండడం, వాడికి కనిపించింది. వెంటనే వాడు పెద్ద గొంతుతో, "ఎవర్రా వాళ్ళు ? ఇది ఈ రాత్రి మీరు చేయబోయే రెండో దొంగతనమా ?" అని కేక వేశాడు.

ఆ కేక వింటూనే దొంగలిద్దరూ అదిరి పడి పరిగెత్తసాగారు. శివుడు వాళ్ళను వెంబడించి, సూర్యోదయం వేళకు, అరణ్యప్రాంతాన గజదొంగ జగ్గడుండే కొండగుహను చేరాడు.

గజదొంగ తన అనుచరులు చెప్పింది విని, కోపంగా, "అంత దూరం వెళ్ళి, వెయ్యి వరహాలతో తిరిగి వచ్చారా ? పైగా ఎవడో ఒకడు కేక వేస్తే పారిపోయి రావడమా ? సరే, పదండి !" అంటూ దాపులనున్న జలపాతం కేసి బయలుదేరాడు.

ఇది అదనుగా శివుడు, గజదొంగ దొంగిలించిన ధనమంతా ఒక మూటగానూ, వృద్ధదంపతుల వెయ్యివరహాలను మరొక చిన్న మూటగానూ కట్టి, అక్కడి నుంచి బయలుదేరాడు.

వాడు దారిలో వృద్ధదంపతుల ధనాన్ని ఇంటి కిటికీలోంచి లోపల పడవేసి, కొలువు తీరివున్న మయూరపురి రాజు మహాదేవవర్మను సమీపించి, ధనపు మూటను ఆయన పాదాలముందు వేశాడు.

గాలిలో తేలియాడుతూ ఒక మూట తన పాదాలముందు పడడం, అందులో విలువైన నగలూ, మణిమాణిక్యాలూ వుండడం చూసి రాజు ఆశ్చర్యపడుతూ

న్నంతలో, శివుడు, "మహారాజా! ఇది గజదొంగ జగ్గడు ప్రజలను కొల్లగొట్టి దాచిన దొంగసొమ్ము. నష్టపోయినవారికి తిరిగి అందజేయండి. ఆ దుర్మార్గుడు దక్షిణదిశనున్న అరణ్యంలోని ఒక కొండ గుహలో వున్నాడు. దాని దాపుల ఒక జలపాతం వున్నది," అని చెప్పాడు.

కంఠస్వరం తప్ప మనిషి కనబడక పోవడంతో, రాజు అమితాశ్చర్యం చెంది, "మహానుభావా! మా రాజ్యానికి ఇంత ఉపకారం చేసిన, తమ రెవరు?" అని అడిగాడు.

శివుడు బదులు చెప్పకుండా, అక్కడి నుంచి బయలుదేరి, వనదేవత వుండే స్థలం చేరి, "తల్లీ, వనదేవతా! నేను తిరిగి రావడానికి కొంత ఆలస్యం అయింది. క్షమించు!" అని ప్రార్థించాడు.

అప్పుడు వనదేవత స్వరం కోపంగా, "నా షరతును ఉల్లంఘించావు. నీ పని చక్కబెట్టుకురమ్మంటే, మరి కొన్ని పనులకు నేనిచ్చిన శక్తిని ఉపయోగించావు. అందుకు శిక్షగా నువ్వు శాశ్వతంగా నీ రూపాన్ని కోల్పోయావు." అని వినిపించింది.

దానికి శివుడు, "తల్లీ! నువ్వేశిక్ష విధించినా సంతోషంగా అనుభవిస్తాను. నా బాధ అంతా, నా ముసలితండ్రి గురించే. ఆయన జీవితం సుఖంగా జరిగిపోయేలా ఆశీర్వదించు," అని వేడుకున్నాడు.

ఆ వెంటనే వనదేవత ప్రత్యక్షమై, "నిన్ను పరీక్షించేందుకు అలా అన్నాను. నీలో స్వార్థం లేదు. నీ పరోపకారబుద్ధి, నాకు నచ్చింది. నీ అసలురూపం నీకు ప్రసాదిస్తున్నాను," అని శివుణ్ణి ఆశీర్వదించింది.

శివుడు, వనదేవతకు కృతజ్ఞత చెప్పుకుని ఇల్లు చేరాడు. వాడి తండ్రి, కొడుకు తిరిగి వచ్చినందుకు చాలా ఆనందపడ్డాడు. ఆ తర్వాత శివుడి పూలతోటలో, బంగారు గులాబీలు పూశాయి. ఆ విధంగా వాడు భాగ్యవంతుడై, ఆపదలో వున్న వాళ్ళకు సాయం చేస్తూ, పరోపకారిగా గొప్ప పేరు తెచ్చుకున్నాడు.



# వృత్తిరహస్యం!

శెళ్ళంగేరి గ్రామానికి చెందిన ధర్మనందనుడనే ఆయన, ఒక ప్రసిద్ధ పుణ్యక్షేత్రం దర్శించ డానికి, భార్యనూ, కుమార్తెనూ వెంటబెట్టుకుని బయలుదేరాడు. ఆ పుణ్యక్షేత్రం చేరాలంటే, ఒక నది దాటాలి.

ధర్మనందనుడు నది దగ్గిరకు వెళ్ళేసరికి, అక్కడ యాత్రికులను నది దాటించేందుకు, ఒక పడవ సిద్ధంగా వున్నది. ఆయన పడవవాణ్ణి, నది దాటించేందుకు మనిషికి ఎంత తీసు కుంటావు అని అడిగాడు.

"అయ్యా, కేవలం ఒక్క రూపాయి మాత్రం," అన్నాడు పడవవాడు.

ధర్మనందనుడికి చాలా ఆశ్చర్యం వేసింది. నదిలో నీళ్ళు నిండుగా వున్నాయి; పైగా నది ఆవలిగట్టు కనుచూపుమేరలో లేదు.

ధర్మనందనుడు, భార్య కుమార్తెలతో పడవ ఎక్కి, నది దాటి, దైవదర్శనం చేసుకుని, సూర్యాస్తమయంవేళ తిరిగి నది దగ్గిరకు వచ్చాడు. ఆలయం వున్న ప్రాంతాల ఎటువంటి వసతి, భోజన సదుపాయాలు లేవు. అందువల్ల, యాత్రికులు బాగా చీకటి పడకముందే నది దాటి, ఈవలిగట్టు చేరుతారు.

పడవవాడు, ధర్మనందనుడికేసి నవ్వుతూ చూసి, "అయ్యా, మరేం అనుకోకండి. తిరుగు ప్రయాణానికి ఒక్కొక్కరికి ఐదు రూపాయిల చొప్పున, మొత్తం పదిహేను రూపాయిలు!" అన్నాడు.

"ఉదయం నది దాటించేందుకు, ముగ్గురికి కలిపి మూడు రూపాయిలే గదా తీసు కున్నావు? ఇప్పుడు పదిహేను రూపాయిలడుగుతున్నావేమిటి? ఇందుకు తగిన కారణం ఏమైనా వున్నదా?" అని ప్రశ్నించాడు ధర్మనందనుడు ఆశ్చర్యంగా.

"అయ్యా, క్షమించండి! చెప్పేందుకు లేదు. అది మా వృత్తి రహస్యం!" అన్నాడు పడవవాడు.

—కోలార్ కృష్ణ అయ్యర్






## 2

[హిమాలయ పర్వతాలలోని సదానందముని తన యోగశక్తితో యజ్ఞం నుంచి అద్భుతమైన శక్తియుక్తులు గల అపూర్వుడనే విచిత్ర వ్యక్తిని సృష్టించాడు. దూరప్రాంతం నుంచి ఆర్త నాదాలు విన్న అపూర్వుడు, అక్కడి నుంచి వాయువేగంతో ఒక గ్రామం పొలిమేరను చేరుకుని, తగలబడుతూన్న పేదల ఇళ్ళ మంటలను ఏనుగుల సహాయంతో చల్లార్చాడు.—తరవాత]

ఏనుగులు తరుముకోగానే జమీందారు నౌకర్లు భయంతో, పడుతూ, లేస్తూ మైదానం దాటి గ్రామంలోకి పారిపోయారు. ఏనుగులు మరొకసారి తొండాలెత్తి ఘీంకరించి, అపూర్వుడి ఇష్టానుసారం అరణ్యంలోకి వెళ్ళిపోయాయి.

అపూర్వుడు ఈ ప్రపంచానికి కొత్తే. అయినా, అతణ్ణి సృష్టించిన సదానంద ముని వందలాది సంవత్సరాలు కఠోర తపస్సుతో ఆర్జించిన అద్భుతశక్తులను అతనికి ప్రసాదించాడు. అందువల్ల అతనికి ప్రకృతిలోని రహస్య శక్తులను శాసించడం తెలుసు. ఆ అద్భుతశక్తితోనే అతడు క్షణాలలో ఏనుగులను రప్పించి, పేదల ఇళ్ళను మంటలనుంచి కాపాడగలిగాడు. ఏనుగులకు మనసులోనే కృతజ్ఞతలు చెప్పుకుని వాటిని అరణ్యంలోకి వెళ్ళమని కోరాడు.



ఆ తరవాత అపూర్వుడు, ఆకాశంలో కిలకిల ధ్వనులతో ఎగిరే పక్షులనూ, తెల్లటి మేఘాలనూ, ఎత్తయిన వృక్షాలనూ, మెల్లగా వీచేగాలికి కదలాడే లేత కొమ్మలనూ, నదిలోని అలలనూ, అలల తాకిడికి పుట్టిన తెల్లటి నురగలనూ చూస్తూ సాయంకాలం వరకు అమితానందంతో గడిపాడు. సూర్యుడు పడమటి కొండలచాటుకు చేరుతూన్న సమయంలో, గాలిలో హఠాత్తుగా అతడికొక అరుపు వినిపించింది. అపూర్వుడు ఉలిక్కిపడి, మరుక్షణమే పరుగెత్తడం ప్రారంభించాడు. కొంతసేపటికి గాలిలో కలిసిపోయాడు. అతడు ఒక గ్రామం పొలిమేరలోని ఒక గుడిసెను సమీపించేసరికి బాగా చీకటిపడింది.

"కనికరించండి బాబూ! నా బిడ్డను వదిలిపెట్టి, కావాలంటే నా దగ్గరున్న నగలనూ, డబ్బునూ తీసుకోండి. నా ప్రాణమైనా ఇస్తాను, నా బిడ్డను వదిలిపెట్టండి!" అని ఒకస్త్రీ కంఠస్వరం దీనంగా వినిపించింది.

అపూర్వుడు గుడిసె లోపలికి తొంగి చూశాడు. రాక్షసులవంటి భయంకరాకారులు ముగ్గురి కాళ్ళపైబడి ఒక పేదరాలు దీనంగా విలపిస్తున్నది.

ఆ ముగ్గురిలో..ఒకడు ఒక చేత్తో పద్నాలుగేళ్ళ కుర్రవాడి నోరుమూసి, వాణ్ణి గట్టిగా పట్టుకున్నాడు. రెండవవాడి చేతిలో కొరడా ఉన్నది. మూడవవాడి చేతిలోని పొడవాటి కత్తి, దీపం గుడ్డివెలుగులో తళతళా మెరుస్తున్నది.

ఆ దొంగల నాయకుడు కొరడా ఝుళిపిస్తూ, "నీ నగలూ, డబ్బూ మాకు వద్దు. కావలసినంత ధనం మా దగ్గరున్నది. ఎందుకూ పనికిరాని నీ ప్రాణాలు మేమేం చేసుకుంటాం? మా దేవతకు బలి ఇవ్వడానికి కావలసిన శుభలక్షణాలన్నీ నీ కొడుకులో ఉన్నాయి. అందుకే వాణ్ణి ఎత్తుకుపోతున్నాం. మూడు రోజులుగా వాణ్ణి మేము రహస్యంగా గమనిస్తూనే



ఉన్నాం. అటువంటి కొడుకును కన్నందుకు నువ్వు గర్వపడాలి!'' అన్నాడు.

''వాణ్ణి కన్నందుకు సంతోషమే. అయినా, ఒక్కగానొక్క బిడ్డను మీ కప్పగించి నేనెలా బతకగలను?'' అన్నది పేదరాలు దీనంగా.

''నీ కొడుకు మాకు ఉపయోగపడుతున్నందుకు నువ్వు సంతోషించాలి గాని, బాధపడకూడదు. అదే మాకూ, నీకూ క్షేమం. కేకలు వేసి ఎవరినైనా పిలిచావో నీ ప్రాణాలు దక్కవు. భైరవమల్లు పేరు వింటేనే జనం గజగజలాడిపోతారు. నువ్వూ, నీ భర్తా ప్రాణాలతో వుండాలంటే నోరు మూసుకుని పడి వుండు!'' అని హెచ్చరించి, భైరవమల్లు కుర్రవాణ్ణి బరబరా లాక్కుని తన సహచరులతో సహా దూరంగా కనిపించే అడవి కేసి నడవసాగాడు.

గుడిసె నుంచి వెలుపలికి వచ్చిన ఆ పేదరాలు, నెత్తీ నోరూ బాదుకుంటూ, ''నాయనలారా, నా బిడ్డను కాపాడండి....నా బిడ్డను కాపాడండి. నా భర్త లేని సమయం చూసి, దొంగలు వచ్చి, నా బిడ్డను ఎత్తుకుపోయారు. కాపాడండి, కాపాడండి!'' అంటూ హృదయ విదారకంగా విలపించసాగింది.

ఆమె కేకలు విని గ్రామస్థులు కొందరు అక్కడికి చేరారు. అయినా, వాళ్ళెవరు కూడా బందిపోట్లను పట్టుకోలేరనిపించింది అపూర్వుడికి. అతడు అక్కడి నుంచి బందిపోట్లను వెంబడించి అరణ్యం కేసి నడవసాగాడు.

దొంగలు చాలా దూరం వెళ్ళి చుట్టూ ఎత్తయిన కొండలు గల ఒక లోయలోకి ప్రవేశించారు. లోయకు ఒకవైపున చాలా గుహలు కనిపించాయి. ఒక పెద్ద గుహ ముందు పదుగురు బందిపోట్లు నిలబడి ఉన్నారు.

''దేవతకు కావలసిన కానుకను తెచ్చాం. అన్నీ సిద్ధమే కదా?'' అని అడిగాడు భైరవమల్లు.

"సిద్ధమే దొరా, పూజారి గంగులు సరిగ్గా అర్ధరాత్రికి బలి ఇవ్వాలన్నాడు, దొరా!" అన్నాడు అక్కడున్న ఒక దొంగ.



"అలాగే చేద్దాం. ఈ కుర్రవాణ్ణి, దేవతకు పక్కనున్న ఒక గుహలోకి తీసుకుపోయి పచ్చటి పానీయం తాగించి నిద్రపుచ్చండి. ఒక లోటా నీళ్ళలో ఒకే ఒక చుక్క మాత్రమే పచ్చటి ద్రవం వేయండి. ఎక్కువ ఇచ్చారో వాడు తెల్లవారేవరకు లేవలేడు. బలి ఇచ్చేప్పుడు వాడు మేలుకునే ఉండాలి. నిద్ర పోకూడదు," అని హెచ్చరించాడు భైరవమల్లు.

ఒక బందిపోటు గుహ లోపలికి వెళ్ళి, లోటా నీళ్ళలో ఒక చుక్క పచ్చటి ద్రవం వేసి, దానిని తాగమని కుర్రవాడికి అందించాడు.

"స్పృహలో వున్నా, లేకపోయినా, కుర్రవాడి కాళ్ళు చేతులు బంధించడం మరిచిపోకండి. వాణ్ణి పట్టుకోవడానికి మూడు రోజులు శ్రమపడవలసి వచ్చింది. వాడు తప్పించుకుంటే...." అని భైరవ మల్లు ఇంకా ఏదో చెప్పబోయేంతలో పక్కనున్న ఒక దొంగ అడ్డుపడి, "వాడు తప్పించుకుని ఎక్కడికి పోగలడు దొరా? చుట్టూ కొండలే కదా?" అన్నాడు నవ్వుతూ.

"నోరు మూసుకుని నేను చెప్పినట్టు చెయ్," అన్నాడు భైరవమల్లు చాలా కోపంగా.

ఆ దొంగలు కుర్రవాణ్ణి అక్కడినుంచి గుహలోపలికి తీసుకుపోయి, తమ నాయకుడు చెప్పినట్టు వాడి కాళ్ళు చేతులు గట్టిగా బంధించి, ఒక చాపమీద పడుకో బెట్టారు.

అపూర్వుడు పొదల చాటు నుంచి రహస్యంగా అన్నిటినీ గమనించసాగాడు. అపూర్వుడు కదలడంవల్ల, పొదల మీది ఆకులు మెల్లగా కదిలాయి. దానిని గమనించిన భైరవమల్లు, "ఏమిటది?" అని అడిగాడు.



"కుందేలయి వుంటుంది దొరా!" అన్నాడు పక్కనున్న దొంగ.

ఆ తరవాత ఎవరూ ఆ అలికిడిని పట్టించుకోలేదు.

దొంగలందరూ, అర్ధరాత్రి పూజకు ఏర్పాట్లలో దిగారు. అపూర్వుడు చీకటి మాటున ఒకచోటి నుంచి మరొకచోటికి తిరుగుతూ అక్కడ జరుగుతూన్న తతంగాలను గమనించి, ఆఖరికి, కుర్రవాడు నిద్ర పోతూన్న గుహను చేరాడు. వాణ్ణి అమాంతం ఎత్తుకుపోదామా అంటే, వాడు అపూర్వుడి కన్నా చాలా ఎత్తుగా వున్నాడు. ఏనుగునైనా అవలీలగా ఎత్తగలశక్తి అపూర్వుడికి ఉన్నది. అయినా, కుర్రవాడు తన మీద ఉన్నప్పుడు వేగంగా పరిగెత్తగలమా అన్న అనుమానం అతనికి కలిగింది. కుర్రవాడు కనిపించకపోతే దొంగలు చుట్టుముట్టి తమను పట్టుకోగలరు. అప్పుడు ఇద్దరూ పట్టుబడిపోయే అపాయం ఉన్నది. ఇలా ఇలోచిస్తూన్నప్పుడు ఎవరో పకపకా నవ్వడం వినిపించి, అపూర్వుడు గుహ నుంచి బయటకు వచ్చాడు. పక్క గుహలోని ఒక పెద్దపులి విగ్రహం ముందు కొందరు దొంగలు కూర్చుని వున్నారు. ఆ పెద్దపులే వాళ్ళ దేవత. ఆ విచిత్ర దృశ్యం చూసి అపూర్వుడు విస్తుపోయాడు.

"గంగులూ, నువ్వు పూజారివి! ఆ మాట మరిచి నువ్వూ మాతోపాటు తాగావో నీ చేతులు వణకవచ్చు. అప్పుడు నువ్వు కుర్రవాడి తలను ఒక్క వేటుతో తెగ నరకలేవు. అలా నరకకపోయావో నేను నీ తలను తెగవేయగలను. తప్పు చేసిన వాళ్ళను క్షమించడం అన్నది భైరవమల్లు జాతకంలో లేదు! తెలుసుగదా?" అని హెచ్చరించాడు భైరవమల్లు.

"చిత్తం, నన్ను నమ్ము దొరా, నేను తాగను. నేను పూజా కార్యక్రమం చూస్తాను," అంటూ కొన్ని అడవిపూలను విగ్రహం మీదికి చల్లాడు గంగులు.

అక్కడున్న అపూర్వుడికి ఒక ఆలోచన వచ్చింది. వెంటనే అతడు పచ్చటిద్రవం

గల పాత్ర ఉన్న గుహలోపలికి రహస్యంగా వెళ్ళి, ఆ పాత్ర పక్కనే ఉన్న చిన్న లోటాతో ఆ ద్రవాన్ని తీసుకువచ్చి, వాళ్ళు తాగుతూన్న పానీయంలోకి పోశాడు.

దొంగలు ఆ పానీయాన్ని రెండుసార్లు తాగేసరికి మత్తుగా తూలసాగారు. మూడో సారి తాగేలోపల, వాళ్ళందరూ వింతగా నవ్వుతూ, నేలకు ఒరిగిపోయారు. పానీయం పోస్తూన్నవాడు కూడా కిందపడి స్పృహ కోల్పోయాడు.

''ముహూర్తం దగ్గరపడింది. బాలకుణ్ణి తీసుకురండి,'' అంటూ పూజారి గంగులు వెనక్కు తిరిగిచూసి, నివ్వెరపోయి, ''ఏమిటి? ఏమయింది మీకు? అలా పడిపోయారేమిటి?'' అని అడిగాడు.

వాళ్ళనుంచి ఎటువంటి సమాధానమూ రాలేదు.

అపూర్వుడు వెంటనే కుర్రవాడు నిద్రపోతూన్న గుహలోపలికి వెళ్ళాడు. అప్పుడే వాడు కళ్ళు తెరిచాడు. కాళ్ళ చేతులకు కట్టిన బంధాలను తెంచిన అపూర్వుడి కేసి ఆ కుర్రవాడు ఆశ్చర్యంతో చూడసాగాడు.

''ఆశ్చర్యపడడానికీ, ఆలోచించడానికీ ఇది సమయం కాదు. మనం వెంటనే ఇక్కడి నుంచి బయటపడాలి. మొదట ఒక దుర్మార్గుడి పని పట్టాలి. నా వెంట




రా!'' అంటూ అపూర్వుడు ముందుకు నడిచాడు.

ఆ కుర్రవాడు మంత్రముగ్ధుడిలా అపూర్వుడి వెంట నడిచాడు.

అపూర్వుడు గంగులున్న గుహలోపలికి వెళ్ళి, అక్కడ ఉన్న ఒక పొడవాటి కత్తిని అందుకున్నాడు. పెద్ద పాత్రలోని పానీయాన్ని ఒక రాతి పాత్రలోకి పోసి, గంగులుకు అందించమని కుర్రవాడితో చెప్పి, కత్తిని గంగులు కేసి గురిచేసి, ''ఊఁ తాగు. లేదా ప్రాణాలు దక్కవు?'' అని ఆజ్ఞాపించాడు.

గంగులు అపూర్వుణ్ణి చూసి దయ్యమనుకుని హడలిపోయి కీచుమంటూ అరిచాడు.

"తాగు!" అని హెచ్చరించాడు అపూర్వుడు.

ఇక చేసేదిలేక గంగులు బిత్తరచూపులు చూస్తూ, ఆ పానీయాన్ని గుటా గుటా తాగేసి, రెండు క్షణాలలో తన సహచరులతో పాటు స్పృహ తప్పి పడిపోయాడు.

గుహనుంచి, వెలుపలికి వచ్చిన అపూర్వుడు కుర్రవాణ్ణి, "నీ పేరేమిటి?" అని అడిగాడు.

"సమీరుడు," అనిచెప్పాడు కుర్రవాడు.

"వేగంగా నడువు!" అంటూ ముందుకు నడిచాడు అపూర్వుడు.

వాళ్ళిద్దరూ ఉరుకులతో పరుగులతో తెల్లవారేసరికి, సమీరుడి గ్రామాన్ని సమీపించారు. ఆ ప్రాంతాన్ని పాలించే రాజుగారి ఒక సైనికదళం ఒక పట్టణంనుంచి మరొక పట్టణానికి వెళుతూ, మార్గ మధ్యంలో వున్న ఆ గ్రామంకేసి వచ్చింది. సైనికులను చూడగానే, గ్రామ ప్రజలు, బందిపోట్లు చేసిన దుండగాన్ని గురించి వాళ్ళతో చెప్పుకుంటున్నారు.

దూరంనుంచి ఆ దృశ్యాన్ని చూసిన అపూర్వుడు, కుర్రవాడితో, "సమీరా, నువ్వు వెళ్ళి, బందిపోట్ల స్థావరాన్ని సైనికులకు చెప్పు. మధ్యాహ్నంవరకు బందిపోట్లకు స్పృహ రాదు. సైనికులు వాళ్ళను సులభంగా పట్టుకోగలరు. ఇక నేను వస్తాను," అన్నాడు.

"మీకు నా కృతజ్ఞతలు ఎలా తెలియ చేయాలో తెలియడంలేదు!" అన్నాడు సమీరుడు చేతులు జోడించి కన్నీళ్ళు కారుస్తూ.

"సమీరా! ఈ రోజు నువ్వు ప్రాణాపాయంనుంచి బయటపడగలిగావంటే, మునుముందు జీవితంలో ఏదో మహత్తర కార్యం సాధించడానికే అలా జరిగిందని పిస్తున్నది. నీకు నా సహాయం కావలసి వచ్చినప్పుడు నీ మనసులో నన్ను మూడు సార్లు పిలువు. మరుక్షణమే నీ పక్కన వుంటాను. నా పేరు అపూర్వుడు!" అని చెప్పి అపూర్వుడు అక్కడినుంచి వేగంగా వెళ్ళిపోయాడు. —(ఇంకావుంది)





# సుకుమారి

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీ ప్రయత్నం ప్రతిసారీ విఫలమవుతున్నా, నీ పట్టుదల సడలకపోవడం ఆశ్చర్యం కలిగిస్తున్నది. చదువూ సంస్కారం వుండి కూడా, కొందరు తార్కికదృష్టి, హేతు బుద్ధీ లేనికారణంగా కొన్ని సందర్భాలలో విచిత్రంగా ప్రవర్తిస్తారు. నీ పట్టుదలా ప్రవర్తనతీరూ, ఆ కోవకు చెందుతవన్న అనుమానం కలుగుతున్నది. ఇందుకు ఉదాహరణగా విజయపురి రాకుమారుడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

విజయపురి రాజైన విద్యాధరుడికి, చాలాకాలం వరకు సంతానం కలగలేదు.

## బేతాళ కథలు



ఎన్నో పుణ్యక్షేత్రాలు సందర్శించి, వ్రతాలూ, నోములూ నోచాక రాణీ గర్భవతి అయింది. అయితే, ఇద్దరు కవల పిల్లల్ని కంటూనే ఆమె కన్ను మూసింది. విద్యాధరుడు మళ్ళీ వివాహం మాట తల పెట్టలేదు. ఆయన కొడుకులకు జయుడు, విజయుడు అని పేర్లు పెట్టుకుని అల్లారు ముద్దుగా పెంచాడు. జయుడు, విజయుడి కన్న కొన్ని ఘడియలు పెద్దవాడు. అన్న దమ్ములిద్దరూ అన్యోన్యంగా పెరిగి యుక్త వయస్కులయేసరికి, అన్ని విద్యల్లోనూ ఆరితేరారు.

విద్యాధరుడికి వార్ధక్యం, అనారోగ్యం కారణంగా రాజ్యభారం మోయడం కష్టతరమైంది. అయితే, కొడుకులిద్దరిలో ఎవరికి సింహాసనం కట్టబెట్టాలో, ఆయన త్వరగా నిర్ణయించుకోలేక పోయాడు. కొడుకులిద్దరూ అన్ని విద్యల్లోనూ సమ ఉజ్జీలు.

ఆయన తన అంతరంగికులతో, ఈ విషయమై చర్చించగా, "రాకుమారులిద్దరూ సింహాసనార్హులే. అయినా, పెద్ద వాడయిన జయుడినే రాజును చేయడం ధర్మం!" అని సలహా ఇచ్చాడు ప్రధాన మంత్రి.

ఆ రోజునే విద్యాధరుడు కొడుకులిద్దరినీ, తన మందిరానికి పిలిపించుకుని, "మీ ఇద్దరి వివాహాలూ ఒకేసారి చేసి, పెద్దవాడయిన జయుణ్ణి పట్టాభిషిక్తుణ్ణి చేయాలనుకుంటున్నాను. నా ఆరోగ్యం బావుండడంలేదు. మన రాజ్య సరిహద్దుల్లోని కొండ ప్రాంతాలకు పోయి, కొంత కాలంపాటు అక్కడ ప్రశాంతంగా వుండదలిచాను. త్వరలోనే అన్ని రాజ్యాల రాకుమార్తెల చిత్రపటాలు తెప్పిస్తాను," అని చెప్పాడు.

ఇందుకు జయుడు, "క్షమించండి, నాన్నగారూ! నా కోసం మీరు ఏ చిత్ర పటాలూ తెప్పించనవసరం లేదు. నేను మన ప్రధాన శిల్పాచార్యుడి కుమార్తెను ప్రేమించాను. ఆమెనే వివాహమాడ

తాను," అన్నాడు కొంచెం కూడా తొణక కుండా.

విద్యాధరుడు ఆ మాటలకు నివ్వెర పోయాడు. అయితే కుమారుల పట్టుదల తెలిసి వుండడంతో, ఆయన, "నీ అభి ప్రాయం ఏమిటి, విజయా ?" అని రెండో కొడుకును అడిగాడు.

"రేపు నా అభిప్రాయం చెబుతాను, నాన్నగారూ !" అని తన మందిరానికి వెళ్ళి పోయాడు విజయుడు.

మర్నాడు విజయుడు, తండ్రితో, "నేను లోకంలో అందరికన్న సుకుమారి అయిన రాకుమారినే వివాహ మాడ దలిచాను. అటువంటి రాకుమార్తెల చిత్ర పటాలు మాత్రమే తెప్పించండి," అన్నాడు.

నెల తిరక్కుండా నే, సుకుమారి రాకుమార్తెలుగా భావించబడే చాలామంది చిత్రపటాలు విజయపురి చేరాయి. వాటన్నిటినీ పరిశీలించాక, విజయుడు భువనగిరి, ఉదయగిరి, చంద్రగిరి రాకుమార్తెల చిత్రపటాలను వేరుగా వుంచి, తండ్రితో, "నాన్నగారూ, ఈ ముగ్గురు రాకుమార్తెలనూ స్వయంగా కలుసుకుని, కొన్ని ప్రశ్నలడిగి, ఒకరిని మీ కోడలుగా తీసుకువస్తాను. నేను బయలుదేరి వస్తున్నట్టుగా, ఆయా రాజ్యా



లకు ఈరోజే వర్తమానం పంపండి," అన్నాడు.

ముందుగా విజయుడు, భువనగిరి రాకుమారిని చూడబోయాడు. భువనగిరి రాజు విజయుణ్ణి స్వయంగా తన మందిరానికి తీసుకుపోయి, సకల మర్యాదలూ చేసి, కుమార్తెను తీసుకురావలసిందిగా పరిచారికను పంపాడు.

కొంతసేపటికి పరిచారిక తిరిగివచ్చి, "క్షమించండి, మహారాజా! యువరాణీ గారు నిద్రపోతున్నారు. రాత్రి వింజామర లోని ఒక నెమలి ఈక యువరాణీగారి తల్పం మీద పడిందట. ఆమె దానిని గమనించలేదు. రాత్రంతా నిద్రలేకపోగా

ఒళ్ళునొప్పులు. సాయంత్రం సమావేశం ఏర్పాటు చేయమని, యువరాణీగారి ప్రధాన చెలికత్తె చెప్పింది," అన్నది.

ఆ సాయంత్రం భువనగిరి రాకుమారిని కలుసుకున్నప్పుడు, విజయుడు ఆమెతో ఏకాంతంగా ఉద్యానవనంలో నడుస్తూ, "ఈ వివాహం నిశ్చయమైతే—మీరు ఆ రోజున నాకిష్టమైన నీలంరంగు పట్టుచీర ధరిస్తారా?" అని అడిగాడు.

"నాకు నచ్చిన ఎరుపురంగు పట్టుచీర ధరిస్తాను!" అన్నది రాకుమారి.

"వివాహం కాగానే, ముందుగా మా నాన్నగారి పాదాలకు నమస్కరిస్తారా, లేక మీ నాన్నగారి పాదాలకు నమస్కరిస్తారా?" అని అడిగాడు విజయుడు.

"మా నాన్నగారి పాదాలకే ముందుగా నమస్కరిస్తాను," అన్నది రాకుమారి తలవంచుకుని.

"వివాహం విందులో ముందుగా నాకిష్టమైన పాయసం తింటారా, మీకిష్టమైనదేమయినా తింటారా?" అని అడిగాడు విజయుడు.

"నాకిష్టమైన బూరెలు తింటాను!" అన్నది రాకుమారి.

విజయుడు భువనగిరి నుంచి, ఉదయగిరి రాకుమారిని చూడబోయాడు.

ఉదయగిరి రాజు పేరుకే రాజు; రాజ్య వ్యవహారాలన్నీ స్వయంగా రాణీయే పర్యవేక్షిస్తుంది. ఆమె విజయుడికి ఘనంగా మర్యాదలు చేసింది.



తర్వాత ఎంతకూ రాకుమారి అక్కడికి రాకపోయేసరికి, విజయుడు, ''రాకుమారిని పిలిపిస్తారా ?'' అని రాణీని అడిగాడు.

దానికి రాణి విచారంగా, ''సాయంత్రం పిలిపిస్తాను, నాయనా! ఉదయం స్నానానికి ముందు చెలికత్తెలు అమ్మాయికి, చందనంలో పాలమీగడ రంగరించి శరీరానికి పూశారు. కాని, పాలమీగడను బాగా చిదమకపోవడంతో, మీగడ తరక అమ్మాయి బుగ్గలో గుచ్చుకుని గాయమైంది. అందువల్ల స్నానం పూర్తవగానే, అమ్మాయి వైద్యుల పర్యవేక్షణలో విశ్రాంతి తీసుకుంటున్నది,'' అని చెప్పింది.

ఆసాయంత్రం ఉదయగిరి రాకుమారిని కూడా, భువనగిరి రాకుమారిని అడిగిన ప్రశ్నలే అడిగాడు, విజయుడు.

మొదటి ప్రశ్నకు ఆమె, "మీకు నచ్చిన నీలంరంగు పట్టుచీరనే కట్టుకుంటాను!'' అన్నది తల వంచుకుని.

రెండో ప్రశ్నకు జవాబుగా, ''ముందు మీ నాన్నగారి పాదాలకే నమస్కరిస్తాను,'' అన్నది వినయంగా.

మూడో ప్రశ్నకు, ''ముందుగా మీకు నచ్చిన పాయసం తిన్నాకే, వేరే ఏదయినా తింటాను,'' అన్నది సిగ్గుపడుతూ.

విజయుడు ఉదయగిరి నుంచి, చంద్రగిరి రాకుమారిని చూడబోయాడు. అక్కడ కూడా అతడికి ఘనమైన స్వాగతం లభిం





చింది. రాజదంపతులు స్వయంగా ఎదురు వెళ్ళి, అతణ్ణి తమ మందిరంలోకి తీసుకు వెళ్ళారు.

విజయుడు అడగకముందే రాజదంపతులు, "నాయనా, నువ్వు మరోలా భావించకు. అమ్మాయిని సాయంత్రం చూపిస్తాము," అన్నారు.

"మీకు వారాలూ, వర్జాలూ లాటి పట్టింపులేవో వున్నట్టుంది!" అన్నాడు విజయుడు నవ్వుతూ.

"అలాంటివేమీ లేవు, నాయనా! ఈ ఉదయం అమ్మాయి దేవీమందిరానికి వెళ్ళి తిరిగి వస్తూంటే, గాలి తాకిడికి రాలిన పారిజాతం పువ్వు అమ్మాయి తల మీద పడింది. అప్పటి నుంచీ మా బంగారు తల్లి భరించలేని శిరోవేదన అనుభవిస్తున్నది," అన్నది రాణి కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ.

ఆ రోజు సాయంత్రం విజయుడు, చంద్రగిరి రాకుమారిని ఆమె మందిరంలో కలుసుకుని, అవే మూడు ప్రశ్నలు అడిగాడు.

చీర ప్రసక్తి రాగానే ఆమె, "చీరరంగు కాదు ప్రధానం; దాని బరువు! ఏ చీర తేలికగా వుంటే, దాన్ని కట్టుకుంటాను," అన్నది.

ఇక పాద నమస్కారాల ప్రస్తావన తేగానే, "వంగి అందరికీ విడివిడిగా పాదాలకు నమస్కారం పెడితే, నా నడుం పడిపోగలదు. అందువల్ల అందరికీ ఒకేసారి చేతులు జోడించి సరిపెడతాను!" అన్నది.

ఆ పిమ్మట తిండి విషయం వచ్చేసరికి, "నా చేతిలో ఏం వుంది? చెలికత్తెలు ఏది తినిపిస్తే అది తింటాను!" అన్నది రాకుమారి చిన్నగా నవ్వుతూ.

విజయుడు అక్కడినుంచి తమ రాజ్యానికి తిరిగివచ్చి, "నాన్నగారూ! చంద్రగిరి రాకుమారిని వివాహ మాడదలిచాను. ఆమె లోకంలో వున్న అందరు రాకుమార్తెల కన్నా సుకుమారి!" అని చెప్పాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, ఏ పురుషుడైనా తన కాబోయే భార్యలో తెలివితేటలూ, వినయం, అందచందాలను గురించి ఆలోచిస్తాడు. అటువంటిది, రాకుమారుడైన విజయుడు, తన భార్య కేవలం గొప్ప సుకుమారి అయితే చాలు ననుకోవడం హాస్యాస్పదం కాదా? ఏ కొద్దిపాటి తార్కికదృష్టీ, హేతుబుద్ధీ, ఇంగితజ్ఞానం వున్నవాడు కూడా, ఇలా ప్రవర్తించడుగదా? ఒకవేళ విజయుడు ఇలా ప్రవర్తించడానికి వేరే ఏమైనా కారణాలున్నవా? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "కవల సోదరుడుగా, వయసులో కొన్ని ఘడియలు చిన్నవాడైనందున, విజయుడికి సింహాసనం దక్కకుండా పోయింది. రాజు కాబోతున్న అన్న, ఏపాటి రాజకీయ పరిజ్ఞానం లేని, ఒక పేద ఇంటి పిల్లను వివాహం చేసుకుంటున్నాడు. ఆ పిల్ల రాణీ అయినప్పుడు, రాచకుటుంబం నుంచి వచ్చే విజయుడి భార్యకు సహజంగానే కంటగింపుగా వుంటుంది. దానివల్ల స్పర్థలకూ, కుట్రలకూ అవకాశం కలుగుతుంది. అందువల్ల అతడి భార్య రాణీ కాకపోయినా, తనలో ఏదో ఒక ప్రత్యేకత వున్నదనే తృప్తి కలిగివుండాలి. నేను లోకంలో అందరు రాజకుమార్తెల కన్న సుకుమారిననే తృప్తి ఆమెకుంటుంది. పోతే, పారిజాతపుష్పం బరువుకే శిరోవేదనకు గురి అయిన సుకుమారి, కిరీటభారం, రాజ్యభారం మోయడానికి సిద్ధపడదు. కుటుంబంలో శాంతి, రాజ్యసుస్థిరత కోరి, విజయుడు ఇలాంటి భార్యను తెచ్చుకున్నాడు తప్ప, తార్కికదృష్టీ, హేతుబుద్ధీ లేనందువల్ల మాత్రం కాదు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)

[ఆధారం: మాచిరాజు కామేశ్వరరావు రచన]



# ఏంత వైద్యం!

కనకపురి అనే ఊరుకు బుద్ధిశర్మ అనే వైద్యుడు, బతుకుతెరువుకోసం వచ్చాడు. అనాటి వరకూ, ఆ ఊరివాళ్ళు వైద్యం కోసం పొరుగూరు వెళ్ళవలసి వచ్చేది. బుద్ధిశర్మ హస్తవాసి మంచిదనీ, ఆయన చికిత్సావిధానంలో ఒక ప్రత్యేకత వున్నదనీ, ఊళ్ళో అందరూ చెప్పుకో సాగారు.

కేశవయ్య అనే ధనికు డొకాయనకు, కడుపునొప్పి మొదలయింది. ఆయన తన సొంత గుర్రపుబండిలో బుద్ధిశర్మ ఇంటికి వెళ్ళి, తన బాధ చెప్పుకున్నాడు.

"కడుపునొప్పి ఎప్పటి నుంచి వస్తున్నది?" అని బుద్ధిశర్మ అడిగాడు.

"ఈ ఉదయానే ప్రారంభమైంది. బాధ భరించలేక, ఈ కాలేఎండలో బండి కట్టించుకుని తమ దగ్గిరకు వచ్చాను," అన్నాడు కేశవయ్య.

"ఉదయం ఏం తిన్నారు?" అని అడిగాడు బుద్ధిశర్మ.

"నాలుగు రొట్టెలు తిన్నాను. బహుశా అవి బాగా కాలి వుండవు!" అన్నాడు కేశవయ్య.

బుద్ధిశర్మ ఒక చిన్న సీసాలో మందు పోసి, కేశవయ్యకు ఇచ్చి, "దీంట్లో వున్నదాన్ని మూడు పూటలు రెండేసి చుక్కల చొప్పున కళ్ళల్లో వేసుకోండి," అన్నాడు.

ఇది విని కేశవయ్య విసుగ్గా, "ఇదేమి వైద్యం? నేను కడుపునొప్పితో బాధపడుతూంటే, కంటికి మందిస్తారేమిటి?" అని అడిగాడు.

ఇందుకు బుద్ధిశర్మ చిన్నగా నవ్వి, "మీ కంటి చూపులో ఏదో లోపం వుండబట్టేగదా, కాలని రొట్టెలు తిన్నారు? కడుపునొప్పి రోజుల తరబడి వుండదు! ముందు చికిత్స జరగవలసింది, మీ కళ్ళకు," అన్నాడు.

—సుంకర భాస్కరరావు



## మహనీయులు కలలుగన్న భారతదేశం:

# భారతీయులం!

బొంబాయి నగరంలోని పార్శీవాళ్ళలో దాదాభాయ్ నౌరోజీ (1825-1917) సుప్రసిద్ధుడు. అయినప్పటికీ ఆయన యావద్భారతదేశానికి గొప్ప నాయకుడుగా పేరు గాంచాడు. లండన్‌లోని 'కామన్స్ సభ'కు భారతదేశం నుంచి సభ్యుడుగా ఎన్నికయిన మొట్టమొదటి భారతీయుడు నౌరోజీ. ఆయన భారత జాతీయ కాంగ్రెస్‌కు మొదట 1886 వ సం॥లోనూ, ఆ తరవాత 1893 వ సం॥లోనూ, ఆ పిమ్మట 1906 వ సం॥లోనూ మూడుసార్లు అధ్యక్షుడుగా ఎన్నికయ్యాడు. నౌరోజీ అధ్యక్షత వహించిన 1906 వ సం॥ జరిగిన కలకత్తా సమావేశంలోనే భారత జాతీయ కాంగ్రెస్—స్వరాజ్యం తన లక్ష్యంగా ప్రకటించింది! 1893 వ సం॥ లాహోర్‌లో జరిగిన కాంగ్రెస్ మహాసభ అధ్యక్షోపన్యాసంలో దాదాభాయ్ నౌరోజీ ఇలా అన్నాడు:

''మనమందరం ఒకే తల్లి బిడ్డలం; మన తల్లి భారతదేశం—అన్న సంగతి మనం ఎల్లప్పుడూ గుర్తుంచుకోవాలి. నేనొక భారతీయుణ్ణి అన్న భావంతోనే నేను నా దేశానికి, నా ప్రజలకూ నా కర్తవ్యాన్ని నిర్వహిస్తున్నాను. మనం హిందువులు కావచ్చు; మహమ్మదీయులు కావచ్చు; పార్శీలు కావచ్చు; క్రైస్తవులు కావచ్చు; అయినా అన్నిటికీ మించి మనమందరం భారతీయులం. మన దేశం భారతదేశం; మనం భారతీయులం అన్న సత్యాన్ని మరచిపోకూడదు.''

## మీకు తెలుసా?

1. ప్రపంచంలోకెల్లా అతి పెద్ద, అత్యంత బరువైన జంతువు ఏదో మీకు తెలుసా?
2. చాలా ఎత్తయిన జంతువు ఏది?
3. ఇంతవరకు అతి బరువైన పురుషుడు ఎవరు?
4. అతని బరువెంత?
5. అతి బరువైన స్త్రీ ఎవరు?
6. ఆమె బరువెంత?

(36 వ పేజీ చూడండి)

మన దేవుళ్ళు:

# కుమారస్వామి



తారకాసురుడనే రాక్షసుడు బ్రహ్మ నుంచి అపూర్వవరాలు పొంది, మితిమించిన అహంకారంతో దేవతలను, రకరకాలుగా హింసించసాగాడు. అసురుల బాధలు భరించలేక ఇంద్రాది దేవతలు పరమశివుడి శరణుజొచ్చి, అసురుల బాధలనుంచి రక్షించమని ప్రార్థించారు. పరమశివుడి ఫాలనేత్రం నుంచి వెలువడిన దివ్య తేజస్సును, అగ్నిదేవుడు గంగానదిలోకి చేర్చాడు. గంగానది దానిని రెల్లునిండిన శరవణసరోవరంలోకి చేర్చింది. అక్కడ అదొక దివ్యశిశువుగా రూపొందింది. ఆ వింతను చూసిన ఆరుగురు కార్తీకమాతలు, ఆ శిశువునెత్తుకుని పాలిచ్చారు. అప్పుడు ఆ బిడ్డకు ఆరుతలలూ, పన్నెండు చేతులూ ఏర్పడ్డాయి.

కార్తీకమాతలు పెంచడంవల్ల ఆ దివ్యశిశువుకు కార్తికేయుడు అనే నామం ఏర్పడింది. ఆరు శిరస్సులు కలవాడు కాబట్టి షణ్ముఖుడు అని కూడా అంటారు. దివ్య సుంధర రూపుడైన

కుమారస్వామిని — సుబ్రహ్మణ్యం, స్కంధుడు, గుహుడు, శరవణుడు అని కూడా అంటారు!

కుమారస్వామి దేవసేనలకు నాయకత్వం వహించి, దానవులను సర్వనాశనం చేసి, తారకాసురుణ్ణి సంహరించి, దేవతల బాధలు తొలగించి ముల్లోకాలకు ఆనందం కలిగించాడు. సుబ్రహ్మణ్యస్వామిని శివపార్వతుల రెండవ కుమారునిగానూ, గణపతికి తమ్ముడిగానూ చెబుతారు.

కన్న తండ్రికే ప్రణవరహస్యాన్ని బోధించిన జ్ఞానస్వరూపుడు సుబ్రహ్మణ్యస్వామి అని భక్తులు కీర్తిస్తారు!

# చందమామ కబుర్లు

## వింతవారసత్వం!

కర్ణాటకరాష్ట్రం ధార్వార్ సమీపంలోని గడగ్ ప్రాంతంలో పుట్టుకతో అంధుడయిన పంచాక్షరీగవీ అనే ఒక విద్వాంసుడు 1914 వ సం॥లో ఒక సంగీత విద్యాలయాన్ని స్థాపించాడు. ఆనాటి నుంచి ఒక్కొక్క తరంలోనూ ఆ సంస్థలో శిక్షణ పొందే వారిలో ఒకరు తప్పకుండా పుట్టుగుడ్డిగా వుంటున్నారు. ఈనాటి సుప్రసిద్ధ గాయకుడు షిమోగా వేణుగోపాల్ కూడా ఆ విద్యాసంస్థలో శిక్షణ పొందినవారే. ఆయనకూ పుట్టుక నుంచే కంటిచూపు లేదు।





## షార్ట్‌హాండ్ రికార్డు!

లోక్‌సభ రిపోర్టర్‌గా పని చేస్తున్న హరీష్ చంద్ర బిష్ట్ 29-వ అలిండియా షార్ట్‌హాండ్ ఛాంపియన్‌షిప్ పోటీలో ప్రథమంగా వచ్చి సరికొత్త రికార్డును సృష్టించాడు. ఆయన ఈ బహుమతిని వరుసగా మూడుసార్లు సాధించాడు. 21 సంవత్సరాల వయస్కుడయిన హరీష్ చంద్ర బిష్ట్, నిమిషానికి 250 పదాలు రాసే వేగాన్ని అందుకున్న వారిలో అతిపిన్న వయస్కుడు।

# సాహిత్యావలోకనం

1. ఉజ్జయినీ, స్ట్రాట్‌ఫోర్డ్-అపాన్-అవాన్, ట్రాయ్, అయోధ్య, మైలాపూర్— ఈ ప్రాంతాలతో సంబంధం గల ప్రాచీన కవులెవరు ?

2. ఆంగ్ల గ్రంథకర్తల సమాధులు ఎక్కువగా గల శ్మశానవాటిక ఏది ?

3. 'ఇండో-ఆగ్లియన్' రచయిత అంటే ఎవరు ?

4. ప్రాచీన భారతదేశంలో ప్రసిద్ధిగాంచిన సంస్కృత వ్యాకరణకర్త ఎవరు ?

5. ఆయన ఎప్పుడు జీవించాడు ? ఆయన రచించిన గ్రంథం ఏది ?

## సమాధానాలు

మీకు తెలుసా ?

1. నీలి తిమింగిలం.

2. జిరాఫే.

3. అమెరికాకు చెందిన జాన్ బ్రౌవర్ మినోచ (1941–83).

4. 635 కి.గ్రా.

5. అమెరికాకు చెందిన పెర్సీపెర్ల్ (1926–72).

6. 399 కి.గ్రా.

సాహిత్యం

1. కాళిదాసు, షేక్స్‌పియర్, హోమర్, వాల్మీకి, తిరువళ్ళువర్.

2. లండన్‌లోని వెస్ట్‌మినిస్టర్ అబే.

3. ఇంగ్లీషులో రచనలు చేసే భారతీయుడు.

4. పాణిని.

5. క్రీ.పూ. 4 శతాబ్దం. అష్టాధ్యాయి.



ప్రపంచ పురాణగాథలు-5

# పెర్సియస్ సాహసాలు

అర్గోస్ రాజు అక్రిసియస్, తన కూతురు కడుపున పుట్టే బిడ్డ తనను చంపుతాడని జ్యోతిష్కులు చెప్పగా విని భయపడి, పసికందుగా వున్న బిడ్డతో సహా యువరాణి డానేను రాజ్యం నుంచి బహిష్కరించాడు.

యువరాణినీ, ఆమె బిడ్డనూ పడవలోకి ఎక్కించి, తుపాను సమయంలో సముద్రంలోకి తోశారు. సముద్ర కెరటాలు కొన్నాళ్ళకు పడవను సెరిఫోస్ దీవికి చేర్చాయి.





పడవలోని తల్లీ బిడ్డలను చూసిన ఒక జాలరి, వాళ్ళను కాపాడి, ఆ దీవిని పాలించే రాజు దగ్గరికి తీసుకు పోయాడు. రాజు వాళ్ళను ఆదరించి ఒక ఆలయంలో ఆశ్రయం కల్పించాడు.

డానె తన బిడ్డకు పెర్సియస్ అని పేరు పెట్టి అనురాగంతో పెంచి పెద్దచేసింది. పెర్సియస్ అసమానమైన ధైర్య సాహసాలు గల యువకుడుగా అందరి దృష్టినీ ఆకర్షించాడు. ఆఖరికి ఆశ్రయం కల్పించిన రాజుకు కూడా పెర్సియస్ పట్ల అసూయ కలగసాగింది!

ఒకనాడు రాజు, పెర్సియస్‌ను ప్రత్యేకమైన ఒక విందుకు ఆహ్వానించాడు. అటువంటి విందుకు వచ్చినవాళ్ళు, రాజుకు గుర్రాన్ని కానుకగా ఇవ్వడం ఆనవాయితీ. వట్టి చేతులతో విందుకు వచ్చిన పెర్సియస్‌ను చూసి మిగతా అతిథులు పరిహాసం చేశారు.

"రాజా! గుర్రానికి బదులు మీకు ఏ కానుక కావాలో చెప్పండి, తెస్తాను," అన్నాడు పెర్సియస్. "మెడూసా తల కావాలి!" అన్నాడు రాజు. మెడూసా భయంకరమైన ఒక ఆడభూతం. ఆ భూతం కళ్ళకేసి చూసినవాళ్ళు మరుక్షణమే రాయిగా మారిపోతారు. అయినప్పటికీ పెర్సియస్, రాజు అడిగిన కానుక తెచ్చి ఇవ్వడానికి బయలుదేరాడు.

మెడూసాను గురించి వినడమే తప్ప ఆ భూతం ఎక్కడ ఉన్నదో పెర్సియస్‌కు తెలియదు. ఆ భూతానికి ముగ్గురు చెల్లెళ్ళు. ఆ ముగ్గురికీ కలిపి ఒక కన్నూ, ఒక పన్నూ మాత్రమే ఉన్నాయి. ఆ రెంటినీ ఒక పెట్టెలో దాచి, అవసరాన్ని బట్టి వంతుల వారీగా ధరించేవాళ్ళు. పెర్సియస్ వాళ్ళున్న చోటికి వెళ్ళి, కన్నూ, పన్నూ గల పెట్టెను నేర్పుగా దాచేసి, వాళ్ళనుంచి మెడుసా వుండే స్థలాన్ని తెలుసుకున్నాడు.





ఆ తరవాత అతడు దేవతలను ప్రార్థించి, దివ్యశక్తులు పొంది మెడుసా మీదికి వెళ్ళాడు. దాని కళ్ళలోకి చూస్తే రాయిగా మారిపోగలడు కాబట్టి, పెర్సియస్ తన చేతిలోని డాలు మీద భూతం ప్రతిబింబాన్ని చూస్తూ దాని మీదికి కత్తిదూశాడు.

పెర్సియస్ ఒక్క వేటుతో మెడూసా తలను తెగనరికాడు. అయినా కత్తి వేటుకు కారిన ఒక్కొక్క బొట్టు రక్తం నుంచీ అసంఖ్యాకంగా పాములు పుట్టుకువచ్చాయి. అయినప్పటికీ పెర్సియస్ ధైర్యంతో దాని తలను ఎత్తుకుని రాజు వద్దకు తిరుగుప్రయాణమయ్యాడు.





పెర్సియస్‌కు ఎథియోపియా సముద్ర తీరంలో అంద్రొమీడా అనే ఒక అందమైన యువతి, బండరాయికి బంధించబడి కనిపించింది. ఆమెను మింగడానికి సముద్రం నుంచి ఒక క్రూర జంతువు ముందుకు ఉరుకుతున్నది. అంద్రొమీడా తల్లిదండ్రులు, ఆ వింతజంతువును అడ్డుకునే శక్తిలేక దీనంగా నిలబడిఉన్నారు!

పెర్సియస్ మరుక్షణమే సముద్రంలోకి దూకి, ఆ వింతజంతువు కుడి భుజాన్ని తెగనరికాడు. దిక్కులు పిక్కటిల్లే విధంగా అరుస్తూ ఆ జంతువు చచ్చిపోయింది. పెర్సియస్ అంద్రొమీడాను బంధాలనుంచి విడిపించాడు.





తమ కూతురు ప్రాణాపాయం నుంచి తప్పించుకోవడం చూసి అంద్రొమీడా తల్లిదండ్రులు పరమానందం చెందారు. తన ప్రాణాలకు తెగించి అంద్రొమీడా ప్రాణాలు రక్షించిన సాహసవీరుడు పెర్సియస్‌కు ఆమెనిచ్చి పెళ్ళి చేయడానికి వాళ్ళు నిశ్చయించారు.

—(ముగింపు వచ్చే సంచికలో)



# యక్షుడి నవ్వులు

యక్షస్థల మనే ప్రదేశంలో సోమగిరి అనే రైతు ఉండేవాడు. అతనికి భూవసతీ, పశువులూ ఉండేవి. కాని అతనిలో కొంత లోభ గుణం ఉండటం చేత పొలాల పనీ, పశువుల పోషణా తానే చూసుకుంటూ, ఉదయం లేచినది మొదలు రాత్రి పొద్దు పోయినదాకా తెగతిరుగుతూ ఉండేవాడు.

ఒకనాటి ఉదయం సోమగిరి తన పశువుల పని చూసుకుని పొలానికి పోతుండగా దారికి కొంచెం దూరంనుంచి ఎవరో గురక పెట్టుతున్న చప్పుడు వినిపించింది. సోమగిరి అటుగా వెళ్ళి చూసేసరికి కొన్ని చెట్ల మధ్య చాలా ఎత్తయిన పుట్టగొడుగూ, దాన్ని అనుకుని పడుకుని నిద్రపోతున్న మరుగుజ్జు మనిషీ కనిపించారు.

మరుగుజ్జు ఆకారమూ, పొట్టా, కురచ కాళ్ళూ, కురచ చేతులూ చూసి, అతనొక యక్షుడని సోమగిరి గ్రహించాడు. ఆ ప్రాంతంలో యక్షులను అప్పుడప్పుడూ చూసిన వాళ్ళున్నారు. పూర్వకాలంలో యక్షులు మనుషులతో స్నేహంచేసి, తమకు గల విద్యల సహాయంతో ఎన్నో మేళ్ళు చేసేవారట. ఆ కాలం పోయింది. ఇప్పుడు యక్షులు మానవులు కనపడితే పారిపోతారు. ఈ నిద్రపోతున్న యక్షుణ్ణి పట్టుకుని నిర్బంధించినట్టయితే వాడి సహాయంతో పెద్ద నిధి సంపాదించుకోవచ్చునని సోమగిరికి తట్టింది. అందుచేత అతను చప్పున వెళ్ళి ఆ యక్షుణ్ణి పట్టేసుకున్నాడు.

"నన్నెందుకు పట్టుకున్నావు? వదిలిపెట్టు!" అని యక్షుడు ఒళ్ళు తెలిసి, పెనగులాడాడు.

"దొరక్క దొరక్క దొరికావు. నాకొక మంచి నిధినిక్షేపం కావాలి. అది ఎక్కడ దొరుకుతుందో చెప్పినదాకా నిన్ను వదిలిపెట్టను," అన్నాడు సోమగిరి.

**25–ఏళ్ళనాటి చందమామ కథ**

''ధనం ఎక్కడ పాతిపెట్టి ఉంటుందో నాకు తెలీదు. నీ కెలా చెప్పేది ?'' అన్నాడు యక్షుడు అమాయికంగా.

''మంచిగా నువ్వు చెప్పకపోతే నీకు చెయ్యవలసినదేదో నేను చేస్తాను,'' అని సోమగిరి యక్షుణ్ణి ఇంటికి తీసుకుపోయి, భోషాణంలో పడేసి, తాళం వేశాడు.

ఒక నెల గడిచింది. ఒకనాడు సోమగిరి అడవి ప్రాంతానికి వెళ్ళి వస్తుండగా ఒక కలపదుంగ దొరికింది. అది అన్ని పక్కలా చెక్కి ఉన్నది. అది ఆ అడవిలోకి ఎలా వచ్చిందో సోమగిరికి తెలియలేదు. అతడు దాన్ని భుజాని కెత్తుకుని ఊళ్ళోకి మోసుకొచ్చి, వడ్రంగి శరభయ్యకు అమ్మి, రెండు రూపాయలు తీసుకుని, ఇంటికి వచ్చాడు.

సోమగిరి ఇంట్లోకి అడుగు పెట్టగానే, భోషాణంలో ఉన్న యక్షుడు వికవికా నవ్వటం వినిపించింది. సోమగిరి యక్షుడితో, "నెలరోజులు నిర్బంధంలో ఉంచినా నీకు బుద్ధి రాలేదు. నాకొక నిక్షేపం చూపించి నీ దారిన వెళ్ళక నీలో నువ్వు నవ్వుకుంటున్నావు. ఎంతకాలం ఇలా భోషాణంలో ఉంటావో ఉండు,'' అన్నాడు కోపంగా.

ఇది జరిగిన కొద్ది రోజులకే సోమగిరి ఇంటికి ఒక దూరపుబంధువు వచ్చాడు. అతడు సోమగిరితో కొంచెం సేపు కబుర్లాడి, మళ్ళీ బయలుదేరాడు.

''భోజనం చేసి పోగూడదా ?'' అన్నాడు సోమగిరి బంధువుతో.



ఆ బంధువుకు సోమగిరి సంగతి తెలును. అందుచేత అతను, ''వద్దులే. పోవలసిన దూరం కానా ఉంది,'' అంటూ బయలుదేరాడు. అతను సోమగిరి ఇల్లు దాటి పది అడుగులు వేశాడో లేదో, పలుపు తెంచుకుని పారిపోతున్న పోట్లగొడ్డొకటి అతన్ని కుమ్మి పడదోసి, పారిపోయింది. కాలు విరిగిన బంధువును సోమగిరి తన ఇంట్లోకి తెచ్చి నెల రోజులపాటు ఉంచుకోవలసివచ్చింది. సోమగిరి తన బంధువును ఇంట్లోకి తీసుకొస్తుండగా భోషాణంలో ఉన్న యక్షుడు రెండోసారి వికావికా నవ్వాడు. సోమగిరి విననట్టు ఊరుకున్నాడు.

ఇంకొక నెల గడిచింది. ఒకనాడు, సోమగిరి సంతకు వెళ్ళాడు. అతను తన డబ్బంతా నేలలో ఒక చోట పాతి ఉంచాడు—ఆ కాలంలో డబ్బు జాస్తిగా ఉన్నవాళ్ళందరూ అలాగే చేసేవారు. సోమగిరి డబ్బు పాతిపెట్టిన చోటికి వెళ్ళి, కొంత డబ్బు తవ్వి తీసుకుని, మిగతాది మళ్ళీ పూడ్చి పెట్టి, సంతకు వెళ్ళిపోయాడు. ఇది ఎవడో చాటునుంచి గమనించి, సోమగిరి వెళ్ళిపోయాక, అక్కడ తవ్వి, పాతిపెట్టిన డబ్బంతా తీసుకుని గుంట జాగ్రత్తగా పూడ్చి, తన దారిన తాను వెళ్ళాడు.

సాయంకాలమయ్యాక సోమగిరి సంతలో కొన్ని సరుకులతో సహా ఇంటికి తిరిగి వచ్చేసరికి, భోషాణంలో వున్న యక్షుడు పగలబడి నవ్వ నారంభించాడు.



సోమగిరికి చాలా కోపం వచ్చింది. అతను భోషాణపు తాళం చెవి తెచ్చి, భోషాణం తెరిచి, యక్షుణ్ణి పట్టుకు పైకి లాగి, "రెండు నెలలుగా నిన్ను నిర్బంధంలో ఉంచినా నువ్వు నాకు ఉపకారం చెయ్యకపోగా విరగబడి నవ్వావు. ఇప్పటికి మూడుసార్లు నవ్వావు. నీ నవ్వుకు కారణం చెప్పకపోయావో, నిన్ను గొంతు పిసికి చంపేస్తాను. చెప్పు, నీ నవ్వులకు కారణ మేమిటి?" అని అడిగాడు.

"ఒక రోజు నీకొక చెక్కిన దుంగ దొరికింది. దాన్ని నువ్వు శరభయ్యకు రెండు రూపాయలకు అమ్మావు. వట్టి మందమతివి కావటంచేత అందులో లక్షలకు విలువైన బంగారమూ, రత్నాలూ ఉన్నట్టు తెలుసుకోలేక పోయావు. శరభయ్య వాటిని తీసుకుని, లక్షాధికారి అయి, హాయిగా బతుకుతున్నాడు. నీ మందబుద్ధి చూస్తే నాకు నవ్వొచ్చింది," అన్నాడు యక్షుడు.

సోమగిరికి ఈ మాట వినేసరికి మతి పోయినట్టయింది. "రెండోసారి మా బంధువు కాలు విరిగినప్పు డెందుకు నవ్వావు?" అని అతను యక్షుణ్ణి అడిగాడు.

"నీ తెలివి తక్కువకే నవ్వాను. రాక రాక వచ్చిన బంధువుకు భోజనం పెట్టి పంపినట్టయితే అతనికి ఆ అపాయం తప్పేది. నువ్వతని భారం నెల రోజులు మోసే అవసరం ఉండేది కాదు," అన్నాడు యక్షుడు.

"మరి ఇప్పుడెందుకు నవ్వుతున్నావు?" అన్నాడు సోమగిరి.

"ఎందుకంటే, నువ్వు పాతి పెట్టిన డబ్బంతా దొంగ కాజేసుకుపోయాడు: నువ్వు పొద్దున అందులో కొంత తవ్వి తీసేటప్పుడు ఆ దొంగ గమనించాడు. అది కూడా నీకు తెలియదు. నీ అంత తెలివితక్కువ వాణ్ణి నేనెక్కడా చూడలేదు," అన్నాడు యక్షుడు.

"నా డబ్బంతా పోయిందా?" అని గట్టిగా అరిచి సోమగిరి తాను డబ్బు పాతి పెట్టిన చోటికి వెళ్ళాడు. ఒక్క రాగినాణెం కూడా మిగలకుండా అంతా పోయింది. సోమగిరి ఏడుస్తూ ఇంటికి తిరిగి వచ్చేసరికి యక్షుడు కూడా లేడు.






మైనాకుడు తనకు సాదరంగా అతిథ్యం ఇస్తానన్నందుకు హనుమంతుడు సంతోషించి, "నీ మాటలే నాకు గొప్ప అతిథ్యం. నీ ఆతిథ్యం నిరాకరిస్తున్నందుకు కోపించవద్దు. నేను ఈ సమయంలో ఏ మాత్రమూ జాప్యం చెయ్యరాదు. సాయంకాలం లోపుగా తిన్నగా లంకకు పోతానని మాట ఇచ్చి ఉన్నాను. మధ్యలో నేను ఆగకూడదు," అన్నాడు.

ఇలా అని హనుమంతుడు మైనాక పర్వతాన్ని చేత్తో తాకి, ఆకాశ మార్గాన ముందుకు సాగాడు. "నీకు కార్యసిద్ధి కలుగుగాక!" అని మైనాకుడూ, సముద్రుడూ హనుమంతుణ్ణి ఆశీర్వదించారు. హనుమంతుడు మైనాకపర్వతాన్ని చూస్తూ ఆకాశంలోకి ఇంకా ఎత్తుగా పోయి, ముందుకు వెళ్ళాడు.

ఇది అంతా చూస్తున్న దేవతలూ, మహర్షులూ, సిద్ధులూ, దేవేంద్రుడూ మైనాకుణ్ణి మెచ్చుకుని, "మైనాకుడి అంత గొప్పవాడి ఆతిథ్యం నిరాకరించటం ఒక్క హనుమంతుడికే తగింది. లోకంలో మరెవరూ అలాచేసి ఉండరు," అనుకున్నారు.

ఇంద్రుడు మైనాకుడితో, "మైనాకుడా, నిన్ను చూసి చాలా సంతోషించాను, ఇక ఎన్నడూ నీకు నా భయం ఉండదు," అన్నాడు. ఈ మాట విని మైనాకుడు కూడా తనకు ఇంద్రుడి భయం తీరిపోయినందుకు ఎంతో సంతోషించాడు.



సురస దేవతల కోరికను పాటించి, మహా భయంకరమూ, వికారమూ అయిన శరీరం ధరించి, హనుమంతుడి మార్గానికి అడ్డంగా నిలబడి, "ఓ హనుమంతుడా, దేవతలు నిన్ను నాకు అహారంగా ఇచ్చారు. నిన్ను తింటాను. నా నోట ప్రవేశించు," అని నోరు తెరిచింది.

ఈ మాట విని హనుమంతుడు ముఖాన సంతోషం కనబరుస్తూ, చేతులు జోడించి, "దశరధుడి కొడుకైన రాముడు, లక్ష్మణుడు అనే తమ్ముడితోనూ, సీత అనే భార్యతోనూ దండకారణ్యానికి వచ్చాడు. ఆ రాముడు కార్యాంతరము మీద ఉన్న సమయంలో రావణుడు సీతను ఎత్తుకు పోయాడు. నేను రాముడి దూతగా సీత దగ్గిరికి పోతున్నాను. అందుకు నువ్వు కూడా సహాయపడు. లేదంటావా సీతను చూసి, రాముడి పని పూర్తిచేసి, నేనే నీ నోటిలోకి వస్తాను. ఇది నిజం," అన్నాడు.

ఈ మాటకు సురస, "నన్ను దాటి ఎవరూ పోలేరు. అలా నాకు వరం ఉన్నది." అన్నది.

సురస నోరు తెరుచుకుని ఉన్నది. ఆ నోరు పెద్ద గుహలాగా ఉన్నది. హనుమంతుడు తన శరీరాన్ని అంగుళం ప్రమాణానికి తగ్గించి, అతి వేగంగా సురస

ఈ లోపుగా హనుమంతుడు సముద్రం మీద చాలా దూరం వెళ్ళిపోయాడు. ఆ సమయంలో దేవతలూ, గంధర్వులూ మొదలైన వారికి హనుమంతుడి బలం ఇంకా ఎంత ఉన్నదో చూడాలన్న కోరిక కలిగింది. వాళ్ళు సర్పాలకు తల్లి అయిన సురస వద్దకు వెళ్ళి, "హనుమంతుడనే వాడు, వాయుపుత్రుడు. సముద్రం మీదుగా ఎగిరి వెళ్ళుతున్నాడు. నువ్వు పర్వతాకారం గల రాక్షసి రూపం ధరించి, పెద్ద కోరలూ, గోరోచనం రంగుగల కళ్ళూ పెట్టుకుని, అతణ్ణి అటకాయించు. అతను నిన్ను గెలిచి ముందుకు పోతాడో, లేక భయపడతాడో చూడాలి," అన్నారు.

నోట్లోకి పోయి మళ్ళీ బయటకి వచ్చి, "దక్షుడి కూతురా, నమస్కారం, నీ నోట్లోకి వెళ్ళి వచ్చాను. ఇక నన్ను సీత దగ్గిరికి వెళ్ళనీ," అన్నాడు.

సురస వెంటనే రాక్షసి రూపం మాని తన మామూలు రూపం ధరించి, "హనుమంతుడా, నువ్వు సుఖంగా వెళ్ళిరా. నువ్వు వెళ్ళే పని జరుగుతుంది. సీతా రాములను తిరిగి కలుపు," అన్నది.

హనుమంతుడు తిరిగి లంక కేసి ఎగురుతూ వెళ్ళాడు. అతను అలా ఆకాశంలో వెళ్ళుతూండగా సముద్రంలో ఉన్న సింహిక అనే రాక్షసి చూసి, "ఇదేదో జంతువు నా పాలపడింది. దీన్ని తిని నా ఆకలి తీర్చుకుంటాను," అనుకుని, హనుమంతుణ్ణి అతని నీడనూ పట్టుకుని లాగసాగింది.

ముందుకు పోయే పెద్ద ఓడను బలమైన ఎదురుగాలి వెనక్కు తోసుకుపోయినట్టుగా అయింది హనుమంతుడి పని. అతను అమిత ఆశ్చర్యంతో అన్ని పక్కలా, పైనా, కిందా చూసేసరికి, సముద్రంలో తేలుతూ ఒక మహా జంతువు కనిపించింది. దక్షిణ సముద్రంలో ఒక అద్భుత శక్తిగల జంతువు ఉన్నదనీ, అది నీడను పట్టుకుని లాగగలదనీ సుగ్రీవుడు ముందే చెప్పాడు. ఇదే



ఆ జంతువు అయి ఉంటుందని హనుమంతుడు గ్రహించాడు.

అతను తన దేహాన్ని పెంచాడు. అది చూసి సింహిక తన శరీరాన్ని పెంచి, తన నోరు హనుమంతుడి శరీరం కన్న పెద్దదిగా చేసి తెరిచి, అతన్ని కబళించబోయింది. ఆ సమయంలో హనుమంతుడు సింహిక శరీరం పరిశీలించి చూశాడు. అతను వెంటనే తన శరీరాన్ని చిన్నదిగా చేసి, సింహిక నోటిలోకి పోయి, దాని గుండె చీల్చి అది తిరిగి నోరు మూసుకునే లోపల బయిటికి వచ్చేసి, శరీరం మామూలు ప్రమాణానికి పెంచాడు. గుండె చీలిపోయి



సింహిక కళేబరం సముద్రం మీద తేలింది.

హనుమంతుడు మళ్ళీ ప్రయాణం సాగించాడు. ఇప్పుడతనికి సముద్రం అవతలి తీరమూ, చాలా దూరాన అరణ్యాలూ కనిపిస్తున్నాయి. లంకా ద్వీపమూ, మలయపర్వతంమీది వనాలూ, నదులు సముద్రంలో కలిసే ప్రదేశాలూ కనబడుతున్నాయి.

అతనికి ఒక ఆలోచన వచ్చింది: తన ఈ పెద్ద దేహాన్నీ, వేగాన్నీ రాక్షసులు చూసినట్టయితే తను వచ్చిన పని పాడవుతుంది. అందుచేత అతను తన శరీరాన్ని చాలా చిన్నదిగా చేసుకున్నాడు. అతను సముద్ర తీరాన గల ఒక కొండ శిఖరం మీద వాలి, దేవేంద్రుడి అమరావతికి తీసిపోని లంకానగరాన్ని చూశాడు.

లంకా నగరం త్రికూట శిఖరం మీద ఉన్నది. హనుమంతుడు లంకా నగరం కేసి పోతూ, బాగా పూచి, దట్టంగా ఉన్న చెట్లుగల పర్వత శిఖరాలనూ, ఉద్యాన వనాలనూ చూశాడు. అతనికి అనేక రకాల పూలచెట్లూ, పక్షులూ, పౌర ఉద్యానాలూ, రాజ ఉద్యానాలూ, అనేకమైన అందమైన దృశ్యాలూ కనిపించాయి.

లంకానగరం చుట్టూ అగడ్తలున్నాయి. వాటిలో తామరలూ, కలువలూ ఉన్నాయి. నగరం చుట్టూ బంగారు ప్రాకారాలున్నాయి. నగరంలోకి ఎవరూ పోకుండా సాయుధులైన రాక్షసులు కాపలా కాస్తున్నారు. చాలా ఎత్తుగా, తెల్లగా ఉన్న ఇళ్ళ మధ్యగా వీధులున్నాయి; ఎక్కడ చూసినా కోట బురుజులున్నాయి; జెండాలున్నాయి. త్రికూట శిఖరం మీద ఉన్న కారణంగా లంకానగరం ఆకాశంలో నిర్మించినట్టుగానే కనబడింది. దాన్ని నిర్మించినవాడు విశ్వకర్మ.

హనుమంతుడు క్రమంగా లంకా నగరపు ఉత్తర ద్వారాన్ని చేరుకుని, రావణుడి బలం ఎంతటిదో గ్రహించటానికి ప్రయత్నించాడు. ఈ మహా నగ



రాన్ని జయించటం ఎవరితరం? ఒకప్పుడు ఇది కుబేరుడిది. కాని ఈనాడు కుబేరుడు కూడా ఇందులో ప్రవేశించలేడు. గుహకు పాములు కాపలా ఉన్నట్టు, ఈ నగరానికి సాయుధులైన రాక్షసులు కాపలా ఉన్నారు. దానికి రక్షగా దాటరాని సముద్రం ఉన్నది. వానరులు సముద్రాన్ని దాటి ఇక్కడికి రావటమే అసాధ్యం; ఒకవేళ వచ్చినా ప్రయోజనం ఉండదు. ఎందుకంటే ఈ లంకను దేవతలు కూడా జయించలేరు. రాముడు ఎంత పరాక్రమవంతుడైతేమాత్రం ఏం లాభం? లోపలికి పోవటమే అసాధ్యమైన ఈ లంకానగరంలో రాముడు ఏం చెయ్యగలడు? రాక్షసులంటే చాలా క్రూరులు. సామం వల్ల వారిని జయించటం సాధ్యం కాదు. సంపదలో మునిగి తేలుతున్న వాళ్ళకు దానోపాయం పని చెయ్యదు. బల గర్వం గల వాళ్ళు కావటంచేత భేదోపాయం పారదు. అతి బలం గల వాళ్ళు గనక యుద్ధానికి అవకాశం లేదు. ఇంతకూ సముద్రం దాటి ఇక్కడికి వచ్చే శక్తి నలుగురికి మాత్రమే ఉన్నది తనకూ, అంగదుడికీ, నీలుడికీ, సుగ్రీవుడికీనూ! మరెవ్వరూ రాలేరు.

ఇలా ఆలోచిస్తున్న హనుమంతుడికి తన ఆలోచన అప్రస్తుతమని తోచింది. "ఈ ఆలోచనలన్నీ ఇప్పుడెందుకు? ముందు సీత బతికి ఉన్నదో, లేదో తెలుసుకోవాలి. బతికి ఉంటే సీతను చూడాలి. తరవాతనే ఏ ఆలోచన అయినా!" అనుకున్నాడతను.

అతని మొదటి సమస్య లంకానగరం ప్రవేశించటం. మరీ పెద్ద శరీరంతో ప్రవేశిస్తే రాక్షసులకు అతను దొరికి పోతాడు. మరీ చిన్న శరీరమైతే లంక అంతా కలయ దిరగటం చాలా కష్టమవుతుంది. అందుచేత హనుమంతుడు తన శరీరాన్ని అంత పెద్దదీ, మరీ చిన్నదీ కాకుండా చేసుకుని, రాత్రివేళ లంక అంతా తిరగ నిశ్చయించాడు. సీతను చూసే లోపల

అతను రాక్షసులకు దొరికి పోవటం ప్రమాదకరం; వాళ్ళు అతన్ని తీసుకుపోయి రావణుడి ముందు పెడతారు. రావణుడు దూత అని మన్నించి, వదిలేవాడు కాడు.

అందుచేత హనుమంతుడు సూర్యుడు అస్తమించేదాకా వేచి ఉండి, తన శరీరాన్ని పిల్లి ప్రమాణానికి తగ్గించుకుని, చూడటానికి వింతగా కనిపించాడు. అతను మామూలు కోతిలాగే దూకుతూ, లంకా నగరం సమీపించాడు.

నగరంలో వీధులన్ని తీర్చి దిద్దినట్టుగా ఉన్నాయి. ఇళ్ళకు చక్కని ప్రాకారాలున్నాయి. వెండి స్తంభాలూ, బంగారు స్తంభాలూ ఉన్నాయి; బంగారు పూత గల కిటికీలున్నాయి. మేడలు ఏడెనిమిది అంతస్తులు గలవి. నగరంలో ఎక్కడ చూసినా స్ఫటికంతోనూ, మణులతోనూ చేసిన అలంకరణలున్నాయి. లంకా నగరం గంధర్వ నగరంలాగున్నది. భయంకరులైన రాక్షసుల రక్షణలో ఉన్న ఆ నగరాన్ని వానరులు ఎలా జయిస్తారో హనుమంతుడికి అంతుబట్టలేదు. సీతను చూడబోతున్నానన్న సంతోషంలో అతను ఈ విచారాన్ని మరిచిపోయాడు.

అంతలో చంద్రోదయమయింది. లంక స్త్రీరూపంలో, భయంకరాకారంతో హనుమంతుడి ముందు ప్రత్యక్షమై, "ఎవరు నువ్వు? ఎందుకు ఇక్కడికి వచ్చావు? నీవంటి కోతి ఈ లంకా నగరంలోకి అడుగు పెట్టరాదు," అన్నది.



దానికి హనుమంతుడు, "నీకు కావలిసినదంతా చెబుతాను. ముందు నువ్వు ఎవరివో చెప్పు. నగరద్వారం దగ్గిర నన్ను అటకాయించి ఎందుకు బెదిరిస్తున్నావు?" అని అడిగాడు.

మహా పరాక్రమశాలి అయిన రావణుడి కింకరిని నేను. రావణుడి ఆజ్ఞచేత నేను లంకాపట్టణాన్ని రక్షిస్తున్నాను. నన్ను జయించి ఎవరూ ఈ నగరంలోకి పోలేరు. నిన్నిప్పుడే చంపేస్తాను. నేనే

ఈ లంకను. ఇక నీ సంగతి చెప్పు.'' అన్నది లంక కోపంగా.

''నాకు లంకా నగరం చూడాలని పించి ఇలా వచ్చాను,'' అన్నాడు హను మంతుడు.

''నన్ను జయించి గాని నువ్వు లంకా నగరాన్ని చూడలేవు,'' అన్నది లంక.

''నేను నగరం చూసి నా దారిన వెళ్ళి పోతాను. ఇంకేమీ చెయ్యను,'' అన్నాడు హనుమంతుడు.

లంక భయంకరంగా అరిచి, హను మంతుణ్ణి చేత్తో కొట్టింది. హనుమంతుడు మరింత భయంకరంగా అరిచి, ఎడమ చేతి పిడికిలితో లంకను పొడిచాడు. ఆ దెబ్బకే లంక విలవిలా తన్నుకుంటూ కింద పడి, ''అయ్యో. నన్ను చంపకు. నువ్వు చాలా బలంగలవాడివి. నన్ను ఒక కోతి జయించిన నాడు రాక్షసులకు ప్రమాదమని బ్రహ్మ ఒకప్పుడు చెప్పాడు. రావణుడు సీతను తీసుకురావడంవల్ల ప్రమాదం రానున్నట్టు కనబడుతుంది. వెళ్ళి, నగరమంతా నీ ఇష్టం వచ్చినట్టు తిరుగు,'' అన్నది.

తరవాత హనుమంతుడు నగరంలోకి ద్వారంకుండా ప్రవేశించక, శత్రువుకు తగినట్టుగా ప్రాకారం మీది నుంచి దూకి, ఎడమకాలు ముందు నగరంలో పెట్టాడు. అతడు రాజవీధి వెంబడి పోతూంటే, సంగీత వాద్యాల ధ్వనులూ, మనుషులు నవ్వుతున్న ధ్వనులూ వినిపించాయి. ఇళ్ళు చాలా ఎత్తుగా, మణులతోనూ, పుష్పమాలలతోనూ అలంకరించి, ఎంతో అందంగా ఉన్నాయి. ఆడవాళ్ళు మూడు స్థాయిలలోనూ మనోహరంగా పాడుతున్నారు. కొందరు రాక్షసుల ఇళ్ళ నుంచి వేదపఠనం వినిపిస్తున్నది. కొందరు రాక్షసులు గట్టిగా అరుస్తున్నారు. వీధులలో అక్కడక్కడా రాక్షస సైని కులు కూడి ఉన్నారు.

''ప్రవేశించరాని లంకలో ప్రవేశిం చాను. సీతను తప్పక చూస్తాను,'' అను కున్నాడు హనుమంతుడు.





# పండితుడి విషయం

ఒకానొకప్పుడు సీతాపురమనే గ్రామంలో, మాధవయ్య అనే భూస్వామికి మంగళు డనే కొడుకుండేవాడు. మంగళుడికి రాని విద్యలేదు. ముఖ్యంగా వాడు సహజ పండితుడు. అందువల్ల వాడికి తండ్రి చేస్తున్న వ్యవసాయం, వడ్డీ వ్యాపారం పట్ల ఏమాత్రమూ ఆసక్తి లేదు.

మంగళుడికిచెప్పలేనంత అహంకారం. తన ఇంటి పాలేళ్ళనీ, తన ఇంటికి అప్పు కొచ్చిన పేదరైతులనీ, సీతాపురంలో చదువురానివాళ్ళనీ, ఏదో వంకన పలక రించి చిన్నబుచ్చి ఎద్దేవా చేస్తూండేవాడు.

మాధవయ్య ఎన్నోమార్లు ఇది తగదని మంగళుడికి చెప్పాడు. అందరితోనూ శత్రుత్వం తెచ్చుకుంటే, ఊళ్ళో బ్రతకడం కష్టమవుతుందని నచ్చ జెప్పా లని చూశాడు. దీనికి మంగళుడిలా సమాధానం చెప్పాడు :

"పండితుడైన వాడికి తన పాండిత్యం ప్రదర్శించుకోవాలని వుంటుంది. ఆకాశంలో వెలిగే సూర్యభగవానుడిలా పండితుడైనవాడు కూడా మహాతేజస్వి. సామాన్యుడు ఎండ వేడిమికి తట్టుకోలేడని, సూర్యుడు తన ప్రతాపాన్ని చూపడం మానుతాడా ? సూర్యుడి వేడిమివల్లనే మనకు పంటలు, ఫలాలు వస్తున్నాయి. వానలు కురుస్తున్నాయి. అదేవిధంగా, నా పాండిత్యం ఉపయోగించేవారికి ఉపయోగపడుతూనే వుంటుంది."

ఇందుకు మాధవయ్య, "నువ్వు చెప్పింది బాగానే వుంది. ఊరంతా నీ కారణంగా మన కుటుంబానికి ఎదురు తిరిగితే, మనకు నిలవ నీడ లేకుండా పోతుంది గదా!" అన్నాడు.

"నేనేమీ అంత తెలివితక్కువవాణ్ణి కాను. మన ఊళ్ళో అందరికంటే ధనికు

"వసుంధర"



లైన కనకయ్య, రత్నగుప్తుడు, వరహాల సెట్టి నాకు మంచి మిత్రులు. సీతాపురం గ్రామాధికారి మహానందుడు, ఊరికల్లా పెద్ద వస్తాదు భీమన్న నేనంటే ప్రాణమిస్తారు. ఈ అయిదుగురూ పంచభూతాల్లా నన్నాదుకుంటూనే వుంటారు కాబట్టి, మననెవరూ ఏమీ చేయలేరు," అన్నాడు మంగళుడు.

మాధవయ్య బాధగా, "ఈ అయిదుగురూ పరమదుర్మార్గులు. ఎదుటివారిని బాధపెట్టి వినోదిస్తారు. వీళ్ళతో నువ్వెన్నాళ్ళని వేగగలవు?" అని అడిగాడు.

"వాళ్ళు పరమదుర్మార్గులే కావచ్చు. అయినా ఊరంతా కలిసి వాళ్ళనేమీ చేయలేరుకదా! కాని, వాళ్ళు తలచుకుంటే మనలను కూడా ఏమైనా చేయగలరు. అందుకే నేను, వాళ్ళతో స్నేహం చేస్తున్నాను. నావంటి మహాపండితుడు, వాళ్ళలో లేని గుణాలు వున్నట్లు చెప్పి పొగుడుతూంటే, వాళ్ళు చాలా సంతోషించి నాకు మంచి మిత్రులయ్యారు. వాళ్ళనింకా సంతోష పెట్టాలనే, నేను నా పాండిత్యంతో ఇతరులను బాధిస్తున్నాను," అన్నాడు మంగళుడు.

తన కుమారుడు దుష్టుల స్నేహంలో పడి దుష్టుడైపోతున్నాడని, మాధవయ్యకు అప్పు డర్థమైంది. ఆయన ఈ విషయమై ఏం చేయాలా అని మథనపడుతూండగా, మంగళుడి మేనమామ చుట్టపుచూపుగా వాళ్ళింటికి వచ్చాడు. ఒకటి, రెండు రోజుల్లోనే ఆయనకు మేనల్లుడి ధోరణి అవగతమయింది.

ఆయన మాధవయ్యతో, "నేను మంగళుడికి నా కూతురు నిచ్చి పెళ్ళి చేద్దామనుకుంటున్నాను. వాడిలో అన్నీ మంచి లక్షణాలే, ఒక్క అహంకారం తప్ప. నా మాట విని వీణ్ణి గంగాపురంలోని రంగనాథ పండితుడి వద్దకు పంపు," అన్నాడు.

కొడుకు అహంకారం తగ్గించడానికి, ఏం చేయడానికైనా సిద్ధంగా వున్న

మాధవయ్య వెంటనే మంగళుణ్ణి పిలిచి, "గంగాపురంలో రంగనాధుడనే మహా పండితు డున్నాడట. వెళ్ళి, ఆయన్ని ఓడించి మన ఊరుకు మంచి పేరు తీసుకురాగలవా ?" అని అడిగాడు.

మంగళుడు సరేనని వెంటనే బయల్దేరి గంగాపురం చేరుకుని, రంగనాధుడి ఇంటికి వెళ్ళాడు. తీరాచూస్తే ఆ ఇల్లు అతిసాధారణంగా వున్నది. రంగనాధుడు కూడా ముతక బట్టలు కట్టుకుని సామాన్యంగా కనిపిస్తున్నాడు. ఆయన భార్య వంటి మీద ఆభరణాలు లేవు.



ఎంతో అట్టహాసంగా తనింటికి వచ్చిన మంగళుణ్ణి, రంగనాధుడు ఎంతో వినయంగా పలకరించి, వచ్చిన పని అడిగి తెలుసుకుని, "నీ ముఖంలోని తేజస్సే నీవు మహా పండితుడివని చెబుతున్నది. నువ్వు చదివిన కావ్యాలు, వ్యాకరణ గ్రంథాలు ఏమిటో చెప్పు!" అన్నాడు చిన్నగా నవ్వుతూ.

మంగళుడు వాటి గురించి చెప్పగానే, "ఇంత చదివిన నీతో, నేను పోటీపడ గలనా? నీ గొప్పతనాన్ని నేనంగీకరిస్తు న్నాను. నువ్వు నా ఇంట్లో నాలుగు రోజు లుండి, నువ్వు చదివినవాటి వివరణ చెబితే విని సంతోషిస్తాను," అన్నాడు రంగనాధుడు.

"పోటీ లేకుండా లభించిన గెలుపు కంటే, పోటీలో ఓటమికే నేను ఇష్టపడ తాను. మనం పోటీపడవలసిందే!" అన్నాడు మంగళుడు పట్టుదలగా.

"సరే, ఎలాగూ నువ్వు నాలుగు రోజుల పాటు, నా ఇంట్లో వుంటావుగదా! ఆ తర్వాత అయిదవ రోజున మనం కలిసి పట్నం వెళదాం. అక్కడ జమీందారు నాగరాజుగారి ఆస్థాన పండిత పదవికి పోటీ జరుగనున్నది. నాకు ఆహ్వానం వచ్చింది. నాతోపాటు నువ్వూ వచ్చి ఆ పోటీలో పాల్గొనవచ్చు. ఆ విధంగా నీ కోరిక తీరుతుంది," అన్నాడు రంగనాధుడు.



అయితే రంగనాధుడు దేనికీ మంగళుణ్ణి ఖండించకపోవడంతో, వాడికి మనసులో, "రంగనాధుడు లోతుగా నాతో చర్చించడానికి భయపడుతున్నాడు. అంటే అయనది మిడిమిడి జ్ఞానమే కావచ్చు!" అనిపించేది.

అయితే, రంగనాధుడి గురించి, మరొక విషయం కూడా మంగళుడికి అంతు పట్ట లేదు. ఒకసారి రంగనాధుడి ఇంటికి ఒక రైతు కూరగాయలు తెచ్చి ఇచ్చి, "అయ్యా, నా పొలంలో పండిన ఈ పంట, మీ ఇంటి వంటగా మారితేనే దానికి సార్థకత!" అన్నాడు.

దీనికి రంగనాధుడు నవ్వి, "మనిషికి తిండిపెట్టేది చదువుకాదు, నీవంటి రైతు. నావంటి వాళ్ళ ప్రాణం నిలబెట్టే నీవు నిన్ను, నన్ను సృష్టించిన ఆ బ్రహ్మదేవుడి కంటే గొప్పవాడివి," అని రైతును మెచ్చుకుని పంపేశాడు.

ఈ విధంగా ఎందరో సామాన్యులను రంగనాధుడు తనకంటే గొప్పవాళ్ళని మెచ్చుకోవడం మంగళుడికి నచ్చలేదు.

పట్నానికి ప్రయాణమై వెళ్ళే రోజున వాళ్ళు సామాను రెండు మూటలుగా కట్టారు. మూటలు బరువుగా వున్నాయి. వాటిని పడవరేవుదాకా మోయడానికి, వేరే మనిషి కావలసివచ్చాడు. మామూలుగా

మంగళుడు దీనికెంతో సంతోషించాడు. ఎందుకంటే—అక్కడ ఒక్క రంగ నాధుణ్ణే కాక, మరెందరో పండితుల్ని ఓడించి తన ప్రతిభను నిరూపించుకుని గర్వంగా తన ఊరుకు తిరిగి వెళ్ళవచ్చు!

మంగళుడు, రంగనాధుడింట నాలుగు రోజులున్నాడు. రంగనాధుడి భార్య వాణ్ణి సొంత అక్కలా ఆదరించి భోజనం పెట్టేది. రంగనాధుడి పిల్లలిద్దరూ బాగా చిన్నవాళ్ళయినా, సత్ప్రవర్తనతో వాడికి మర్యాదలు చేశారు. రంగనాధుడు, మంగళుడు రోజూ సాహిత్య గోష్ఠి చేస్తూండేవారు. రంగనాధుడుసామాన్యుడు కాదని మంగళుడికి అర్థమయింది.

వచ్చే పనివాడు వంట్లో బాగుండక ఎవరో కొత్తవాణ్ణి పంపాడు. ఆ కొత్తవాడికి చిరాకు ఎక్కువ. గొణుక్కుంటూనే వాడు మూటలు నెత్తి మీద పెట్టుకున్నాడు. వాడి వెనకనే మంగళుడు, రంగనాధుడు నడక ప్రారంభించారు.

రంగనాధుడింటికి పడవరేవు చాలా దూరం. పడవకు సమయం మించిపోతే, మరొక పడవ దొరకదని రంగనాధుడు, మూటలు మోసేవాణ్ణి త్వరగా నడవమని హెచ్చరించాడు.

దానికి వాడు చిరాగ్గా, "ఈ పొద్దు ఎండలో మూటలు నీ నెత్తి మీద పెట్టుకుని నడు, కష్టం తెలుస్తుంది!" అని రంగనాధుణ్ణి కసిరాడు.

"వాడేమన్నా ఊరికే మోస్తున్నాడా, డబ్బు తీసుకుని మూటలు మోసేవాడికింత అహంకారమేమిటి?" అని మంగళుడు మండిపడబోగా రంగనాధుడు అతణ్ణి వారించి, మూటలు మోసేవాడితో, "అవును, నాయనా! మావల్ల కాని పని నువ్వు చేస్తున్నావు. కానీ ఆలస్యమైతే పడవ వెళ్ళిపోతుంది. అప్పుడు నీ శ్రమ, నా శ్రమ కూడా వృధా అవుతుందన్న ఆత్రుతలో, నిన్ను తొందరపెట్టినందుకు నన్ను క్షమించు. నీకు కష్టం లేకుండా వెళదాం. ఆ పైన మన అదృష్టం," అన్నాడు.



ఏమనుకున్నాడో మూటలు మోసేవాడు నడక వేగం హెచ్చించి సమయానికి పడవరేవుకు చేర్చాడు.

పడవ నడిపేవాడు రంగనాధుణ్ణి చూస్తూనే చేతులు జోడించి నమస్కరించి, "అయ్యా! తమరు వస్తున్నారని కబురు తెలిసి పడవను కాసేపు ఆపాను. శ్రీరామచంద్రుడి కోసం గుహుడిలా, తమ రాక కోసం ఎదురు చూస్తున్నాను," అన్నాడు.

"అంత మాటనకు. ఈదరి నుంచి ఆదరికి చేర్చే నీ విద్యముందు, నా విద్య లేపాటివి?" అంటూ వాణ్ణి మెచ్చుకుని పడవ ఎక్కాడు రంగనాధుడు.



ఇదంతా మంగళుడికి నచ్చలేదు. అయినా ఏమీ అనకుండానే తనూ పడవ ఎక్కాడు. పడవలో తెలిసినవారందరికీ, "నాకంటే గొప్ప పండితుడు." అని మంగళుణ్ణి గురించి రంగనాథుడు చెప్పాడు.

పడవ పట్నం చేరుకునేసరికి, రేవులో జమీందారు నాగరాజు పంపగా వచ్చిన దివాను ఎదురొచ్చి రంగనాథుడితో, "అయ్యా, జమీందారుగారు స్వయంగా రావాలనుకుని పనులవత్తిడివల్ల రాలేకపోయారు. అన్ని ఏర్పాట్లూ నన్ను చేయమన్నారు. వారికి తమ దీవెనలు, నా ద్వారా పంపగలరు!" అన్నాడు.

రంగనాథుడు నవ్వి, "నా బదులు మహారాజు పడవలో వచ్చివుంటే, నాగరాజు ఎన్ని పనులున్నా మానుకుని రాగలడు. ఎందుకొచ్చిన మాయమాటలు ? పండితులను గౌరవించడం భోజుడికీ, ఆంధ్ర భోజుడికీ చెల్లింది. పులిచర్మం కప్పుకుంటే నక్క, పులి అయిపోగలదా ? నాగరాజుకు అంతస్థుల పట్టింపు ఎక్కువ. నావంటి పేదపండితుణ్ణి స్వయంగా వచ్చి ఆహ్వానించలేదు. తనకు దీవెనలు కావాలంటే మాత్రం స్వయంగా రావాలని చెప్పు." అన్నాడు దివానుతో.

ఈ మాటలు విని మంగళుడాశ్చర్యపడ్డాడు. రంగనాథుడిలో అహంకారమంటూ వున్నదని, అంతవరకూ వాడికి తెలియదు. ఏం జరుగుతుందోనని వాడు భయపడ్డాడు కానీ, దివాను మారుమాట్లాడకుండా వాళ్ళిద్దరికీ విడిది ఏర్పాట్లు చేశాడు. మరి కొంతసేపటికి జమీందారు స్వయంగా విడిదికి వచ్చి, రంగనాథుణ్ణి మన్నించమని అడిగాడు.

రంగనాథుడు మౌనంగా తల వూపి వూరుకున్నాడు. జమీందారు వెళ్ళిపోయాక మంగళుడు ఆశ్చర్యంగా రంగనాథుణ్ణి, "మిమ్మల్ని పొగిడే సామాన్యుల్ని కూడా మీరు తిరిగి పొగిడారు. ఒక మూటలు మోసేవాడు మిమ్మల్ని ఈస

డిస్తే కోపగించుకోకుండా మన్నించమని అడిగారు. జమీందారుపట్ల మీ ప్రవర్తన నాకు కేవలంఅహంకారంలా కనిపిస్తున్నది. ఆయన నిర్వహించే పోటీలో ఓటమిని కోరి, మీరీపని చేస్తున్నారా ?'' అని అడిగాడు.

రంగనాధుడు తల అడ్డంగా తాటించి, ''పండితుడైనవాడు తనకంటే తక్కువ వారిని వినయవిధేయతలతో గౌరవించాలి. తనను శాసించగల గొప్పవారినీ, తనకు ప్రయోజనకరంగా వుండేవారినీ అహంకారంతో శాసించాలి. నేనదే చేశాను.'' అన్నాడు.

''అలా ఎందుకు చేయాలి ?'' అని ప్రశ్నించాడు మంగళుడు.

''తన పాండిత్యంతో గొప్పవాళ్ళను శాసించగలిగినప్పుడే, ఆ పాండిత్యం గొప్పదవుతుంది. జరగబోయే పోటీలో నేను వినయంతో కాక పాండిత్యంతో విజయంసాధించదలుచుకున్నాను. జమీందారుపట్ల వినయంగా వుంటే, అప్పుడు పోటీలో గెలిచినా నాకు తృప్తిగా వుండదు. నా పాండిత్యబలంతో జయించాలనుకున్నప్పుడు, నేనీ పద్ధతిలోనే మసలాలికదా!'' అన్నాడు రంగనాధుడు.

అది విన్న మంగళుడికి తన ప్రవర్తన గుర్తుకొచ్చి సిగ్గుపడ్డాడు. పండితుడైనవాడు చేతకానివాళ్ళను సాధించడం మాని, శక్తిమంతుల్ని ఎదిరించలేకపోతే అతడు ప్రతిభావంతుడు కానేరడు. అదీ కాక, రంగనాధుడు తనపట్ల అహంకరించకుండా గౌరవించాడంటే, ఆయన తనను కూడా తక్కువవాడని అనుకున్నట్లేకదా! ఇది గ్రహించాక—మంగళుడిక పోటీలో పాల్గొనకుండా, రంగనాధుడి వద్ద సెలవు తీసుకుని సీతాపురం తిరిగి వెళ్ళాడు.

అక్కడ మంగళుడు సామాన్యులను గౌరవిస్తూ, గొప్పవారికి తల వంచకుండా కొత్త జీవితం ప్రారంభించి, అచిరకాలంలోనే మంచి పేరు తెచ్చుకునేసరికి, కొన్నాళ్ళకు వాడు కూడా జమీందారు నుంచి ఆహ్వానం పొందేటంత గొప్పవాడయ్యాడు.





# దద్దమ్మ

చాలా కాలం కిందట, ఒక గ్రామంలో నిరుపేద రైతు కుటుంబం ఒకటుండేది. రైతుకు ముగ్గురు కొడుకులు. మొదటి ఇద్దరూ తెలివైనవాళ్ళు, చురుకైనవాళ్ళు. మూడోవాడు కైపాంగ్ మాత్రం, ఎప్పుడూ ఏదో ఆలోచిస్తూ అన్ని పనుల్లోనూ మందకొడిగా వుండేవాడు. ఇది చూసి అన్నలిద్దరూ వాణ్ణి ఏమీ చేతకాని దద్దమ్మ అని పిలిచేవారు. తండ్రి కూడా తన మూడో కొడుకు దద్దమ్మ అయిపోయాడనీ, అప్రయోజకుడనీ విచారించేవాడు.

కైపాంగ్ ఎన్నడూ తన సంగతి పట్టించుకునేవాడు కాదు. కాని, గ్రామంలో ఎవరిదైనా ఒక మేకగానీ, గొర్రెగానీ తప్పిపోయిందని తెలిస్తే, దాన్ని వెతికి పట్టుకుని యజమానికి అప్పగించేవరకూ, వాడికేమీ తోచేదికాదు. తానే వాళ్ళకంటే ఎక్కువ ఆరాటపడేవాడు.

తమ్ముడి. ఈ ప్రవర్తన చూసి అన్నలిద్దరూ వాణ్ణి ఇంట్లోంచి తరిమేశారు. చేసేదిలేక తండ్రి నిట్టూర్చి ఊరుకున్నాడు.

దిక్కుతోచని కైపాంగ్ దేశదిమ్మరి అయాడు. దొరికిన ఏ కాయో కసురో తినేవాడు. దయతలచి ఏ అమ్మ అయినా ఇంత గంజిపోస్తే తాగేవాడు; ఏదీ దొరకక్కపోతే పస్తులుండేవాడు.

ఇలా వాడు కాలం వెళ్ళబుచ్చుతూండగా, ఒక గ్రామంవాళ్లు—దూరంగా ఎక్కడో వున్న ఒక కొండ గుహలో ముసలిసాధువు ఒకాయన వున్నాడనీ, ఆయనకు గొప్ప శక్తులున్నవనీ చెప్పగా విన్నాడు. కైపాంగ్, ఆ సాధువును వెతుకుతూ పోగాపోగా, ఒక గ్రామం తగిలింది. ఆ గ్రామస్థులూ, వాళ్ళ పశువులూ తిండీ, నీరూ లేక మలమల మాడిపోతున్నారు. పొలాలు బీళ్ళయిపోయాయి. చెరువులు

మంగోలియా జానపద కథ

ఎండిపోయాయి. కారణం, గ్రామానికి జలాధారంగా వుండే ఏరు ఎండిపోయింది. ఎలాగైనా శక్తిమంతుడైన సాధువు దర్శనం చేసుకుని, గ్రామస్థులకు సాయ పడాలని క్రైపాంగ్ అక్కడి నుంచి బయలుదేరాడు.

వాడికి దారిలో కుగ్రామం తగిలింది. గ్రామానికి చివరగా వున్న ఒక పూరి గుడిసెలో ఒక పేదరాలూ, చక్కని చుక్కలాంటి ఆమె కూతురూ వాడికి కనిపించారు. సాధువు గురించి భోగట్టా చేస్తుంటే, అవిడ కూతురు పుట్టు గుడ్డిదని క్రైపాంగ్‌కు తెలిసింది. సాధువును ప్రార్థించి, ఆ అమ్మాయికి చూపు తెప్పించాలని వాడు నిశ్చయించుకున్నాడు.

కొన్నాళ్ళకు వాడు ఎలా అయితేనేం, సాధువు వున్న గుహకు చేరాడు. సాధువు వాడు వచ్చిన పని తెలుసుకుని, ఇంత ఉపకారబుద్ధి గలవాడు లోకంలో వున్నందుకు ఆశ్చర్యపడి, చేయవలసిందేమిటో వాడికి ఉపదేశించాడు.

క్రైపాంగ్ అక్కడి నుంచి బయలుదేరి, పస్తులతో అలమటిస్తున్న గ్రామం చేరి, ఎండిపోయిన ఏరు పుట్టినచోటు వెతుక్కుంటూ బయలుదేరాడు. వెళ్ళగా వెళ్ళగా, ఒకచోట ఎత్తయిన గుట్ట మీది నుంచి సన్నటి జలధార కిందికి జాలు



వారడం వాడి కంటబడింది. వాడు మరి కొంచెం ముందుకు వెళ్ళి, అక్కడి దృశ్యం చూసి ఆశ్చర్యపోయాడు.

గుట్ట అవతల వున్న కొండ మీది నుంచి కిందికి దుముకుతున్న జలపాతానికి అడ్డంగా, కొన్ని ఏనుగులు పడుకుని వున్నవి. ఆ కారణంవల్ల నీరు ఏటివాగుకేసి రాకుండా, మరొక వైపుగా ప్రవహిస్తున్నది. క్రైపాంగ్ ఏనుగులను ఎంత అదిలించినా, బెదిరించినా కదలామెదలక వూరుకున్నవి. ఇది పని కాదని వాడు, అక్కడ దొరికిన ఎండు పుల్లలూ, ఆకులూ పోగుచేసి గుట్టగావేసి, చెకుముకిరాయితో నిప్పుచేసి, వాటికి అంటించాడు.

క్షణాలమీద అక్కడ లేచిన మంటలూ, పొగా చూసి ఏనుగులు బెదిరి, అక్కడి నుంచి పారిపోయాయి. ఆ వెంటనే జల పాతంలోని నీరు, ఎప్పటిలా చాలుగుండా పారుతూ వచ్చి, ఎండిపోయిన ఏటిని చేరింది. మరుక్షణం ఏటి నీరు ఉర వళ్ళూ, పరవళ్ళూ తొక్కుతూ, జలాధారం కోల్పోయి కష్టాలపాలయిన గ్రామం కేసి బయలుదేరింది.

ఈ విధంగా సాధువు చెప్పిన ఉపాయం అమలుజరిపి, కైపాంగ్ గ్రామస్థులకు జలా ధారం కల్పించి, గుడ్డిపిల్ల వున్న గ్రామం చేరాడు. పిల్లతల్లి, కైపాంగ్ మళ్ళీ ఎందుకు వచ్చాడా అని ఆశ్చర్యపడు తూన్నంతలో, వాడు గుడ్డిపిల్ల దగ్గిరకు పోయి, ఆమె తల మీద రెండు చేతులూ పెట్టాడు. వాడి చేతులు తాకగానే, గుడ్డి పిల్లకు చూపు వచ్చింది. ఇది చూసి తల్లీ కూతుళ్ళు పరమానందం చెందారు.

ఈ విధంగా, ఆ పిల్లకు కాబోయే భర్త తల తాకగానే, ఆ పిల్లకు చూపు వస్తుం దనీ, దానితోపాటు సిరిసంపదలూ ప్రాప్తించగలవనీ సాధువు చెప్పిన మాట నిజమయింది.

పేదరాలు అప్పటికప్పుడే కైపాంగ్‌కూ తన కూతురుకూ పెళ్ళి చేసి ఇద్దర్నీ దీవించి సాగనంపింది. కైపాంగ్ భార్యతో స్వగ్రామానికి బయలుదేరాడు. అందరూ దద్దమ్మగా భావించి ఈసడించిన కైపాంగ్, సాధించిన ఘనకార్యాలు క్షణాలమీద చుట్టుపట్ల గ్రామాల్లో తెలిసి పోయింది. జనం దారి పొడుగునా వాడికి బ్రహ్మరథం పట్టారు.

ఇల్లు చేరిన కైపాంగ్‌ను చూసి, అన్న లిద్దరూ ఈర్ష్యతో కుమిలిపోతూ తలలు వంచుకున్నారు. అది గమనించిన కైపాంగ్ తండ్రి, కొడుకు లిద్దరితో, "తోబుట్టిన వాడన్న ప్రేమ లేకుండా, ఇంతకాలం మీరు వాణ్ణి దద్దమ్మకింద జమకట్టి, ఇంట్లో నుంచి తరిమివేశారు. మీరు స్వార్థపరులు; వాడు పరోపకారి!" అని, చీవాట్లుపెట్టి, చిన్న కొడుకునూ, కోడలినీ దీవించాడు.






పొడవాటి కొమ్ములు గల కొండజాతి మేకలు కొండలను చకచకా ఎక్కగలవు. మొనదేలిన ఈ మేకల కాలి గిట్టలు పల్లంగా లోపలికి వంగి, మధ్య మెత్తగా ఉండడంవల్ల రాళ్ళమీద కూడా బలమైన పట్టు దొరుకుతుంది. ఆ కారణంగా ఈ మేకలు కొండలను సునాయాసంగా ఎక్కుతాయి.



## బల్లి తోక!

మచ్చలు గల బల్లి లావుపాటి తోకలో ఆహారమూ, తడీ ఉంటాయి. అపాయం కలిగినప్పుడు బల్లి తోకను తెగనరికి సట్టు వదిలి వేయగలదు. ఆ తరవాత కొత్త తోక మొలుస్తుంది!

సహజముత్యాలలో అన్నిటికన్నా పెద్దది 'లోట్జేముత్యం'. 9.5 అంగుళాల పొడవూ, 5.5 అంగుళాల వ్యాసమూ గల ఈ ముత్యం బరువు 6.37 కి॥గ్రా॥. ఈ ముత్యం 1936 వ సం॥లో ఒక బ్రహ్మాండమైన ముత్యపుచిప్ప నుంచి కనుగొనబడింది!



## అతి పెద్ద ముత్యం!

## నైలునది కింద మరొక నది!

1958 వ సం॥ 'రేడియో ఐసోటోప్స్' సహాయంతో నైలునది కింద మరొక పెద్ద నది ప్రవహించడం కనుగొన్నారు. ఈ అంతర్వాహినిలో నైలునదీజలానికి ఆరింతలు ఎక్కువ జలం ప్రవహిస్తుందని తెలిసింది!



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1991 జూన్ నెల సంచికలో ప్రకటింపబడును.



K. Padmanabha



Devidas Kasbekar

★ పై ఫొటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ ఏప్రిల్ నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి:– చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

### ఫిబ్రవరి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: మురిపెం తెలిసిన మనసు! రెండవ ఫోటో: కపటం తెలియని వయసు!

పంపినవారు: బి. వి. ఎల్. సరోజ, స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, మెయిన్ బ్రాంచ్, గుడివాడ, కృష్ణాజిల్లా (ఆం.ప్ర.)

బహుమతి మొత్తం రు. 50/– నెలాఖరులోగా పంపబడుతుంది.


## చందమామ

ఇండియాలో సంవత్సర చందా: రూ. 36-00

చందా పంపవలసిన చిరునామా:

చందమామ పబ్లికేషన్స్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026

Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.

# విజయచిత్ర

సినిమా వినోదానికి ప్రతినిధి
పాఠకులకు పరిశ్రమకూ వారధి

వర్ణచిత్రాలు కంటికి ఆనందం
తారల కబుర్లు మనసుకు ఆహ్లాదం

చూసినకొద్దీ చూడాలనిపిస్తుంది
చదివినకొద్దీ చదవాలనిపిస్తుంది

ప్రజాదరణే పునాదిగా



24 సంవత్సరాలుగా
నిర్విరామంగా, నిత్యనూతనంగా
వెలువడుతోంది...

తప్పక చదవండి - చదివించండి!

**విజయచిత్ర**

చిత్రప్రియుల అభిమాన పత్రిక

# Cuddles always say "I love you."

Show your little ones how much you love them! And is there a better way of doing that than giving them a huggable, cuddlable playmate?

Cuddles. From the people who have given children the delightful entertainer of a magazine, Chandamama. Cuddles. A whole new range of stuffed toys. And, your old favourites. And, cute surprises being introduced regularly. Each one a sweet, adorable companion to your child. Absolutely safe. Designed to withstand childhandling.

Well, the fun and excitement of the festive season is just round the corner. Make it memorable for your child with a special gesture. With a Cuddle.

- CUDDLES — Stuffed toys from Chandamama.
- SAMMO — Mechanical and electronic toys from Chandamama

**CUDDLES**

Manufactured in technical collaboration with Sammo Corporation South Korea

**CHANDAMAMA TOYTRONIX**

Chandamama Toytronix Private Limited, Chandamama Buildings, Vadapalani, Madras - 600 026

*from*

**THE HOUSE OF**

**CHANDAMAMA**

CUDDLES AND SAMMO TOYS WILL BE AVAILABLE AT ALL LEADING TOY OUTLETS EXCEPT IN THE STATES OF ASSAM, HIMACHAL PRADESH, MADHYA PRADESH AND NORTH EASTERN STA